Alcott, William A.(William Andrus),
1798-1859

తేనీరువిషతుల్యము

బెజవాడ, 1929

Record no. 619

Alcott, William A. (William Andrus), 1798-1859

Tēnīruviṣatulyamu

Bejavāḍa, 1929

Record no. 619

---

## Bibliographic Record Target

Alcott, William A.(William Andrus), 1798-1859.
తేనీరువిషతుల్యము / డాక్టరు విల్లియం ఎ. ఆల్కాట్ గారి యాంగ్ల గ్రంథమనకు శ్రీమతి జ్ఞానాంబగారి యనువాదము.- బెజవాడ : ప్రకృతి కార్యాలయము, 1929.
56 p. ;19 cm.
Record no. 619

Alcott, William A.(William Andrus), 1798-1859.
Tēnīruviṣatulyamu / Ḍākṭaru Villiyaṃ E. Ālkāṭ gāri Yāṅgla granthamanaku Śrīmati Jñānāmbagāri yanuvādamu.- Bejavāḍa : Prakṛti Kāryālayamu, 1929.
56 p. ;19 cm.
Record no. 619

---

ప్రకృతి గ్రంథమాల 84.

# తేనీరు విషతుల్యము

గ్రంథకర్త:

డాక్టరు విలియం ఎ. ఆల్ కాట్.

అనువాదకులు:

శ్రీమతి జ్ఞానాంబగారు.

ప్రకాశకులు:

ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల యందు

క. కోదండరామయ్యగారిచే

ముద్రింపఁబడియె.

1929.

ఇతరులకు వెల రు 0-10-0.

ప్రకృతి చందాదారులకు వెల రు 0-6-0.

Maximum light given.

ప్రకృతి గ్రంథమాల 34



# తేనీరు విషతుల్యము.

డాక్టరు విల్లియం. ఎ. ఆల్కాట్ గారి

యాంగ్ల గ్రంథమునకు,



శ్రీమతి జ్ఞానాంబగారి

యనువాదము.



ప్రకాశకులు:

ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

బెజవాడ. ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.

1929



ఇతరులకు వెల. 0—10—0

ప్రకృతి చందాదారులకు. 0—6—0

ప్రకృతి గ్రంథమాల 34



# తేనీరు విషతుల్యము.

డాక్టరు విల్లియం. ఎ. ఆల్ కాట్ గారి

యాంగ్ల గ్రంథమునకు,



---

శ్రీమతి జ్ఞానాంబగారి

యనువాదము.



---

ప్రకాశకులు:

ప్రకృతి కార్యాలయము, బెజవాడ.

---

బెజవాడ. ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.

1929



ఇతరులకు వెల. 0—10—0

ప్రకృతి చందాదారులకు. 0—6—0

# తేనీటిని త్రాగవద్దు



తేనీరు శరీరమునకు మేలుచేయునట్టి వస్తువు కాకపోగా కీడుచేయునట్టి మందుదినుసై యున్నదనియు నది ఆహారపదార్థము కాదు గావున దానివలన నొక రక్తబిందువైనను నొదవజాలదనియు మెదడునకు నాడీమండలమునకు నుద్రేకము నొదవించి క్రమముగ వానిని క్షీణదశకు తెచ్చునట్టి ప్రేరేపక గుణ మీ యాకునం దున్నదనియు, దీని నెంతమాత్రము వాడకూడదనియు గొప్ప గొప్ప డాక్టరులు, పథ్యవేత్తలు ఘంటాపథముగా జెప్పుచున్నారు. ఇది యిట్లుండ నాగరికత కాలవాలమగు నీకాలమున నెటచూచినను టీపార్టీలు, కాఫీక్లబ్బులు నను శబ్దములే వినవచ్చుచున్నవి. తేనీటిపానము హానికరమని ఆరోగ్యసంఘములలో కూడ నొక్కి చెప్పబడుట లేదు. రోగులకు, బాలింతలకు, నీరసదేహులకు తేనీటిని నిశ్శంకముగా నిచ్చుచున్నారు. కావున నీగ్రంథమును చదువు పాఠకులు తాము తేనీటిని విషప్రాయముగ భావించి దానికి దూరముగా నుండుటయేగాక తమ బంధు మిత్ర పరివారములలోను, తమకు సంబంధించిన సంఘములలోను తేనీటి పానమున కవకాశము లేకుండునట్లు తోడివారికి దానివలని కీడులం గూర్చి తెలుపవలయును. ఆచార్యులు, సంస్కర్తలు, మత బోధకులు వైద్యులు ముఖ్యముగా తేనీటిపానమును విసర్జించి జనులు తమ మార్గము ననుసరించునట్లు తోడ్పడవలయును. వసనాభి, పాషాణము, సారాయి, నల్లమందు, మున్నగు దుష్ట పదార్థములవలనే కడు చెడ్డవస్తువగు తేయాకును పూర్తిగా విసర్జింపవలయును.

— జ్ఞానాంబ

# తేనీరు విషతుల్యము.

(డాక్టరు విల్లియం. ఎ. అల్ కాట్ గారి యాంగ్లగ్రంథమునకు శ్రీమతి జ్ఞానాంబగారి యాంధ్రీకరణము.)

## పీఠిక.

ఆరోగ్యమును, ఆనందమును, దీర్ఘజీవనమును ప్రసాదించునట్టి జీవనవిధానము నవలంబించుడని ప్రజలకు బోధించి సమ్మతింపజేయుట కేవల మసంగతముగ కన్పట్టుచున్నది. మనుష్యజాతియొక్క ఆరోగ్యమునకుగాని, ఆనందమునకుగాని, విజయమునకుగాని, దీర్ఘాయుస్సునకుగాని సంబంధింపని యితర విషయములు వేనవేలు విరివిగా చర్చింపబడుచున్నవి. అట్టి విషయములను గూర్చి జనులు లాభము పొందినను లేక పోయినను ఆసక్తితో చదువుచుందురు. నక్షత్రసమన్వితమగు విశ్వముయొక్క వైచిత్ర్యములను గూర్చియు, గభీర సముద్రములో లోతుఅందెడు భాగములను గూర్చియు, సముద్రములో సమతలముపై తేలుచుండు ప్రవాళవనపంక్తులను గూర్చియు, అగాధ సముద్రగర్భమున ప్రకాశించుచున్న మణులయొక్క సమృద్ధినిగూర్చియు వారు శ్రద్ధతో పఠింతురు. కాని కేవలము ఆరోగ్యవంతమైన ఆహారమునే తినుడనియు, అనారోగ్యకరములగు పానీయములను త్రాగబోకుడనియు చెప్ప మొదలిడగనే ఆశ్చర్య చకితులై కనుబొమ లెత్తి చూచెదరు. కొందరీ సంగతులన్నియు నెవరినో గూర్చి చెప్పబడుచున్నవనియు తమకీ యాలోచనలతో సంబంధము లేదనియు తలంతురు. "మన తండ్రులు, తాతలు మంచిమంచి

పదార్థములనెల్ల తినలేదా? మిక్కిలి మెత్తనిదైన రకరకముల పిండితో వారి బల్లలు నింపబడుచుండెను. అతిథిసత్కారపరత గల వారి భోజనము వెన్నతోడను, తేనెతోడను సారవంతమైనదిగా చేయబడుచుండెను. ధారాళముగ వాడబడు కాఫీ, ఉల్లాసకరమైన తేనీరు, అపుడపుడు వాడబడు ద్రాక్షసారాయము వారి యతిథులయొక్కయు వారలయొక్కయు హృదయములను రంజిల్ల జేయుచుండెను. ఇపుడు మాకు వట్టినీరు మాత్రమే సహజమైన పానీయమని చెప్పబడుచున్నదా? సంతోషమును కలుగ జేయునట్టియు, మత్తు నొదవింపనట్టివియు నగు తేనీరు, కాఫీ యీపానీయముల నెవ్వరు స్వీకరింపకుండ నుండెదరు?" అని వారడిగెదరు. పై పానీయముల వలన మత్తు కలుగునా? లేదా? యనునదే మనయెదుట నిపు డున్న ప్రశ్న. తేనీరు, కాఫీ యీవస్తువు లుద్రేకమును కలుగఁజేయుటయేగాక అజీర్ణవ్యాధిని, నాడీదౌర్బల్యమును, హృదయక్షోభమును, అనేకుల విషయములో నాకస్మికమరణమును కలుగజేయుననియు, ఎవరికిగాని స్వల్పమైన మేలును కూడ కలుగజేయ లేవనియు నిపుడు విశ్వసింపబడుచున్నది. ఈవిషయములు వలసినంత హేతునిరూపణముతో తెలుపబడును గావున నికముందు వివరింపబడు దానినెల్ల నిష్కపటబుద్ధితో పరిశీలింపవలయునని సర్వజనులను కోరుచున్నాను. పొందదగిన మేలంతటిలోను మిగుల సహజముగ లభింపగల యారోగ్యము ప్రకృతి ధర్మజ్ఞాన విహీనత వలనను, శారీరక పరిజ్ఞానశూన్యత వలనను సులువుగా గోల్పోవబడుచున్నది. సాధారణముగ



సంభవించు ఫలితములను గూర్చిన యుపేక్షవలనను, తుదకీ అభ్యాసమునకు లోనైన నాడీమండలము అంధప్రాయముగ పట్టువిడువకుండ ఘోషపెట్టుట వలనను అనారోగ్యకర పదార్థములను స్వీకరించి యారోగ్యమును గోల్పోవుచున్నారు. మనుష్యుడు పొగాకునకు దాసుడై యుండ వచ్చును. దానిని విసర్జించి వేయవచ్చును. కాఫీకి దాసుడై యుండవచ్చును. దానిని మానివేయవచ్చును. తేనీటికి దాసుడై యుండవచ్చును. దానిని మఱచిపోవచ్చును. ఈవస్తువులలో నెద్ది కాని యవసరమైనదను భావ మాతనికి కలుగనే కలుగదు. సరియైన యాహారముచే పోషింపబడుచు, నేపదార్థము వలనను నుద్రిక్తము కాకుండ నుండు సహజమైన నాడీబలమే యారోగ్యము. ఉద్రేకకర పదార్థసేవనము వలన మెదడు, నాడీమండలము అస్వాభావికముగ పనిచేయును. ఇట్లు వానిలోని ప్రాణశక్తి యంతయు జీర్ణించి పోవును. భయపెట్టుచు, దినమంతయు తద్భయముతోఁగూడి పనిచేయునట్లు గుఱ్ఱమును నిర్బంధింతుమేని యది యెంతకాలము జీవించును? సారాయము, కాఫీ, తేనీరు, తదితరములగు నుత్తేజకములు, ఇవన్నియు సమానమైన యస్వాభావికమగు చుఱుకుదనమును రేపుటచే జనులు శీఘ్రముగా శిథిలశరీరులై పోవుచున్నారు. ఇట్టిజీవనము వలన నొదవు మనోవృత్తులు అస్వాభావికము లగుటచే ఆనందజనకములు కానోపవు.

నెల్సన్, సైజర్.

---

## ప్రథమ ప్రకరణము

# తేయాకుయొక్క చరిత్రము.

అమెరికా బజారులో నమ్మబడునట్టి తేయాకురకములన్నిటిలో నేమైన మంచిగుణము కలదేని యది కొద్దిగనో, గొప్పగనో ప్రేరేపించునట్టి లేక ఉల్లాసకరమైనట్టి గుణమే నని యెల్లఱకు తెలియునని నాయూహ. దాహశాంతి వినా యే గుణమును శరీరమునకు కలుగజేయలేని వస్తువును పాలు, మీగడ, పంచదార చేర్చి సైతము దీర్ఘకాలము స్వీకరించువారు చాల తక్కువమంది మాత్రమే యుందురు. ఐనను తేయాకు యొక్క స్వభావమును గూర్చియు, అది కలుగజేయు యుద్రేకముయొక్క విస్తారతను గూర్చియు ననేకుల కేమియుం దెలియదు. తేయాకు తన ప్రాబల్యమువలన ప్రాణాధార ప్రదేశమందంతటను వ్యాపించుననియు, నది యెంత యుద్రేకమును ఉత్సాహమును కలుగజేయునో యంతగా మేధస్సు, నాడీమండలము, జీర్ణాశయము, హృదయము, కారిజము మున్నగు నవయవములను దాదాపు పులియబెట్టి బట్టీలో వండిన సారాయములు, నల్లమందు, పొగాకు నను వస్తువుల వలెనే బాధించుననియు వారెఱుగరు. ప్రాణదుర్గమును పడగొట్టి నాశము చేయుటకు రహస్యముగ ప్రయత్నించుచున్న నమ్మరాని భయంకర శత్రువు మిత్రవేషమున తమ కౌగిటిలోనున్న సంగతిని వారు గమనించుటయే లేదు. ఇది యిట్లున్నను సత్యమునందలి నిశ్చలగౌరవభావము నన్నీ విషయమును రూఢిపఱుప య



త్నించుటకు బలాత్కరించుచున్నది. 200 ఏండ్ల క్రిందటివఱకు ఐరోపాలోగాని, అమెరికాలోగాని తేయాకను వస్తువు నెవ్వరు నెఱుగరు.

ఇప్పటికి 3200 సం॥ నుండి యూరపు జనులకు నివాసస్థానముగ నున్నది. కావున 10,000,000,000 కు తక్కువకాకుండ మొట్టమొదట నివాసమున్న జనులు తేయాకు నెఱుగకుండనే మరణించిరని తేలుచున్నది. 500,000,000 కు మించని లేక 20 వ వంతు జనులు మాత్రము దానిని చవిచూచినారు. చీనాదేశపు పానీయమగు నీ తేనీరు నెఱుగకుండనే జీవించి మరణించునట్టి యాయపారజనసమూహమునందు దేశము కొఱకు యుద్ధములు చేయుటకుగాని, భవనాదులు నిర్మించుటకుగాని, భూములు దున్నుటకుగాని కావలసిన దేహబలము కొఱతపడియుండెనేమో? బాల్యయౌవనవార్ధక్యములను పొంది దాదాపుగ మఱుపున బడియున్న గ్రీసు, రోము, బ్రిటను మున్నగు శక్తిమంతములును, నాగరికములును నగు దేశముల ప్రజలను గూర్చి స్వల్పముగ తెలియబడిన చరిత్రాంశముల నెఱిగిన వారే నిశ్చయింప వలయును.

తేయాకులో రెండుజాతులు కలవు. ఒకటి (Viridis) విరిడిస్ లేక ఆకుపచ్చనిది. రెండవది (Bohea) బోహియా లేక నల్లనిది. నల్లని తేయాకు చీనా, జపాను దేశముల పంటయై చాలకాలమువరకు ఆ దేశములలోనే యుండెను. అయిన నిటీవల జావాద్వీపమందును, బ్రెజిల్ నందును చైనావారి సాయముతో దానిని పండించుటకు ప్రయత్నములు జరిగెను. 12 వ

త్సరముల క్రిందట నీయాకు ఫ్రెంచిదేశములో ప్రవేశించినది. ఈ రెండురకముల తేయాకును అమెరికాసంయుక్త రాష్ట్రములలో కూడ సాగుచేయబడవచ్చుననియు నట్లు తప్పక జరుగ గలదనియు నాకు భీతి కలుగుచున్నది.

200 సంవత్సరముల క్రిందటి వఱకు తేయాకు యూరపు ఖండములో బ్రవేశింపలేదని నేను చెప్పియున్నాను. ఈస్టు యిండియా కంపెనీవారు 1664 సం॥ లో తేయాకును దిగుమతిచేసినట్లుకన్పట్టుచున్నది. వారుబ్రిటిషు రాజుగారికి బహుమానముగా రెండుపౌనుల రెండుఔన్సులు తేయాకును తెచ్చియుండిరి. నాటినుండి నేటివఱకు నొకప్పుడు కొద్ది వేగముగను నొకప్పు డధిక వేగముగను దాని యుపయోగము వృద్ధి నొందుచునే యున్నది. వర్తమానకాలమున గ్రేటు బ్రిటనులో సంవత్సరమున కెంత తేయాకు వాడబడు నను విషయము అనేక విధములుగ లెక్కింపబడినది. కాని దానివ్యయము 50,000,000 పౌనులకు తక్కువ యుండనేరదు. యూరపునందలి తదితర దేశములలో జనసంఖ్యనుబట్టి చూచిన తేయాకువాడుక బ్రిటను లోకంటె చాలతక్కువగ నున్నది. రషియా, హాలెండు దేశములలోమాత్రము తేయాకువాడుక విస్తార మగుచున్నది. ఫ్రెంచిదేశమున తేయాకు చాలతక్కువగ వాడబడుచున్నది. కాని ఫ్రెంచివారు కాఫీ, వైను, పొగాకు వాడుకలతో యీ కొఱతను తీర్చివేయుచున్నారు. ఐరోపా, అమెరికా ఖండములలో నేదేశమునందును సంయుక్త రాష్ట్రములలో వాడబడుచున్నంత తేయాకు వాడబడుటలేదు. మీదుమిక్కిలి దాని



వాడుకచట కడువేగముగ వృద్ధి నొందుచున్నది. 1821 సం॥ లో దిగుమతియైన తేయాకు కొంచెము తక్కువగ 5,000,000 పౌనులుండెను. 1836 సం॥ లో అనగా 15 సం॥ ల తరువాత దిగుమతి యైనది 16,382,114 పౌను లుండెను. 1830, 1836 సం॥ లలో నైనవృద్ధి మిగుల శీఘ్రముగా నైనది, అది దాదాపు నూటికి నూరువంతు లుండెను. 1821, 1828 సం॥ లలో నైన వృద్ధి కొంచె మధికముగ నూటికి యేబదివంతులు మాత్రముండెను. ప్రతిసంవత్సరము దిగుమతియగు తేయాకులో స్వల్పభాగము తిరిగి యెగుమతి చేయబడు చుండెను. కాని యెన్నడును 2,000,000 పౌనుల తేయాకు ఎగుమతి కాలేదు.

1821 సం॥నుండి 1837సం॥వరకుదిగుమతియైన తేయాకు 150,000,000 పౌనులకంటె హెచ్చుగ నుండెను. దీని వెల 125,000,000 డాలర్లు. (ఒకడాలరు రెండున్నర రూపాయలకు సమము) 1834 నుండి 1837 సం॥ వఱకు దిగుమతియైన తేయాకు 60,000,000 పౌనులకు మించి యుండెను. ఇట్లే 1838 నుండి 1850 సం॥ వఱకు దిగుమతియై వాడబడిన తేయాకు పరిమాణము, 1833 నుండి 1837 వఱకు దిగుమతి యైనదాని పరిమాణముతో సమానమైన సాంవత్సరి కాభివృద్ధితో కూడి దాదాపు 240,000,000 పౌను లున్నది. దానికిమ్మాతు దానిని సిద్ధము చేయుటకు వ్యయమగు కాలము వంటచెఱకు మొదలగు వానిమూల్యము కట్టకుండ లెక్కించినను కొంచెముతక్కువగ 150,000,000 డాలరు లుండును.

---

## ద్వితీయ ప్రకరణము.

## తేయాకు మందు దినుసు.

ఏరకము తేయాకైనను, ఎట్టిస్థితి గతులలో సేవింపబడిన తేయాకైనను సరే వాస్తవముగ మందుదినుసై యున్నదని చూపుటయే యీప్రకరణము యొక్క యుద్దేశము.

దినమంతయు పనిచేసి యలసినపుడుగాని, నిద్రమత్తు కలిగినపుడుగాని యొక గిన్నెడు మంచి తేనీటిని త్రాగినయెడల నలసట తీఱుననియు, నిదురమత్తు తొలగుననియు నెఱుగనివారెవరు? ప్రసిద్ధుడును, లోకోపకారి యగు నుపాధ్యాయుడును నగు ఆంథోనీ బెనిజెట్ గారు సదా బలమైన తేనీటి పానమువలన పాఠశాలాయాసమును పారద్రోలుచుండిరని వారి చరిత్రములో చదువని వారెవ్వరు? బెనిజెటుగారివలెనే యెంత మంది భాషాభిజ్ఞులు చేసియుండలేదు? ఇంకను చేయుచుండలేదు? కాని యీతేయాకు యొక్క యుద్రేకకరములును, ఔషధసంబంధములును నగు గుణములను గూర్చిన దృష్టాంతములకొఱ కధికయత్నము చేయవలసిన యావశ్యకము మనకులేదు. అలసట తీరుటకో, నిద్ర మత్తువదలుటకో తేనీటి ననుదినము పానము చేయు జనులను, ముఖ్యముగా స్త్రీలను మనము చూచుచునే యున్నాము. ఐనప్పటికిని తేనీటిపానమువలన తనకు బలముకలిగినదని తెలివిగల మనుష్యుడెవడు నటింప నేరడు. ఏమన నొకవేళ తేనీటిలో పోషకశక్తి యున్నను, నది మిక్కిలి స్వల్ప పరిమాణముగ నుండును.



ఏవస్తువుగాని లోపలికిపోయి జీర్ణకర్మ క్రమమునకు లోబడి రక్తముగామారి మనకు బలము నీయవలయునన్నచో రెండునుండి నాలుగుగంటల కాలముపట్టును. తేయాకువలన గలుగు శ్రమ నివారణము హఠాత్తుగ గలుగును. దాదాపు క్షణములో జరుగును. ఈగుణము సరాసరి నాడీమండలమునుండి కలుగు ననుటకు సందియములేదు. తేనీరు ప్రవేశింపగనే జీర్ణాశయపు నరము లుద్రిక్తములగును. అనగా రేపబడును. ఈప్రేరేపణము మెదడునకుపోవును. మెదడుయొక్క శక్తి వృద్ధియగును. అల్పకాలమే యుండునదైనను వృద్ధినొందిన యీశక్తి దేహమునకెల్ల పంపబడును. తేనీటిని, కాఫీని, నల్లమందును, సారాయమును, పొగాకును సేవించినపుడు కలుగునట్టియు నిట్టి యనేక వస్తువుల యొక్క సముదాయమును సేవించినపుడు కలుగునట్టియు ఈ హెచ్చుశక్తికియీమిథ్యాబలమునకు నత్యల్ప తారతమ్యముండునని నాయభిప్రాయము. పైవస్తువులలో నొక్కటైనను నొక్క రక్తబిందువుగా పరిణమింపజాలదు. సహజమైన యారోగ్యవంతమైన బలమును కలిగింపనేరదు.

అవి నరములను రేపుట ద్వారా బలము నిచ్చును. నరములను క్రుంగ చేయుట లేక క్షీణింప జేయుట ద్వారా బడలిక తీర్చుట, నిద్రపట్టించుట యను పనుల నెఱవేర్చును. వీని మూలమున మొదట నాడుల కెంతయుద్రేకము కలుగునో సరిసమానముగ పైగుణము లొదవును. తేనీటితో బలము నొందెదమను మైకము గలుగజేసెడు సారాయములతో తిరిగి

జలశాలియై పాడుపటువాడు, నల్లమందుమాత్రితో పోయిన బలమును పొందెడు తురుష్కుడు—వీ రందఱును ఉద్రేకగుణమునకు సంబంధించినంతవఱకు హెచ్చుతగ్గులు లేకుండ సమాన స్థితియం దున్నారు.

తేనీటిపానమువలన ప్రప్రథమమున కలుగు గుణములు ఉద్రేకకరములని చెప్పబడినదిగదా! ఇదినిజము. అనేకులు తేనీరు త్రాగ నలవాటుపడినవారు దానిని త్రాగని శాంతసమయములలో గాఢముగా పశ్చాత్తాపము నొందవలసినంత యెక్కువగా చేతలలోను, మాటలలోను, స్థైర్యమును, నిగ్రహశక్తిని గోల్పోవుదురు. నాల్కజారుటయేగాదు (మాట జారుట) ముఖాకృతి యంతయు నెఱ్ఱబాఱును. కన్నులు విపరీతముగా నుద్రిక్తమగును. యథార్థమునకు మితముగా సేవింపబడిన నల్లమందు, సారాయములవలెనే తేనీరు నడకరీతిని కూడ మార్చునంతగాను, కొంతసేపు సాధారణమగు చుఱుకుదనమును పాటువడు శక్తిని వృద్ధినొందించునంతగాను ప్రాణశక్తులను ప్రోత్సహించును.

తేనీటియందుగల శమనపఱచునట్టియు, అణచివేయునట్టియు గుణములలోనే దానియొక్క యౌషధస్వభావమును నిరూపించునట్టి బలమైన ప్రమాణమును మనము కనుగొనుచున్నాము. ఇంతియేగాక తేనీరు మొదట ఆరోగ్యవర్తనము యొక్క హద్దు దాటబడునంత హెచ్చుగా నుద్రేకము నొందవింపక పోయినచో పిమ్మట మన మంతచేటు క్రుంగిపోవలసినవారము కానేరము. తేనీటివలన శమనకరములును క్రుంగ జేయునవియు నగు నముఖ్యగుణములతోపాటు తలనొప్పి, నిద్ర



లేమి; గుండెదడ; వణకు; ఆకలిలేమి; అజీర్ణము; నాడీ దౌర్బల్యము; మిక్కిలి సులువుగా నలసటయొదవుట కవకాశము; శుష్కించుట, చర్మమెండుట, * ఒగరువస్తువు పూసినరీతి శరీరము పైభాగమువింతగనుండుటయను లక్షణములతో తఱచు కూడియుండునట్టి ప్రాణావయవసంబంధములగు కాలికవ్యాధులు కలుగుచున్నవి. ఒకవేళ ముఖవర్చస్సు నిర్మలముగ నుండినచో కొంచెము విషయమున రంగులో మార్పుకల్గుటకు చాల యేండ్లు పట్టునని గ్రహింపవలయును. మఱియు పైన వర్ణింపబడిన లక్షణము లెవ్వి గాని కలుగుటకు తేయాకుతో నితరప్రాబల్యములు చేరుటకూడ కారణములగునని మనమంగీకరింపవచ్చును.

సర్వదా బలహీనత క్రమముతప్పిన యాకలి, నిదుర, సమానముగ నుండని యుష్ణమును, బలమును, సాధారణమగు ననారోగ్యము కల్గియుండువారెవరు? దారిద్ర్యము, దురదృష్టము, రోగము, మరణము, భవిష్యద్దుఃఖముననువానివలని భీతిచే నెంతయు బాధపడువారెవరు? తమ చుట్టునుండు ప్రపంచమును గూర్చియు, సృష్టిక్రమములను, దైవవిధానములను గూర్చియు నెప్పుడు తప్పు పట్టుచుండువారెవరు? సూర్యుని క్రిందనున్న సకలవస్తువులలోను శూన్యతయు, రోగమయతయు కలవని

* తేనీటిలోని ఒగరు పదార్థముల యొక్క యుపయోగము చర్మము నందలి బహిష్కరణ కర్మనెఱపు రోమకూపముల గుండ పంపబడునపుడా యొగరు వస్తువు తోళ్లు పదను చేయు వాని పెద్ద తొట్టిలోని గొడ్డుతోళ్ల పైన కలిగించిన గుణముమాటి గుణమునే కలిగించునా? లేదా? యని ప్రశ్నింపదగును. పదును బెట్టబడిన తోలువలె నుండెడు ముఖవర్చస్సును బట్టి తేయాకు మిక్కిలి తినువారు ప్రత్యేకముగా గుర్తింపబడుచున్నారు.

మొఱలిడువా రెవరు? ఐహిక విషయములయొక్క మిథ్యాత్వమునుగూర్చిన దృఢనమ్మకము కలవా రెవరని నేను ప్రశ్నించుటలేదు. నే నడుగున దిది. బాధలు కష్టములు చెప్పకొని మూలుగువా రెవరు? మిక్కిలి వ్యాకులపడుచు, చిఱచిఱలాడువా రెవరు? వారు బలాపహారులగు నుత్తేజక పదార్థముల కలవాటుపడినవారే. అందు తేనీరు కాఫీ త్రాగువారు తఱచుగ నగ్రగణ్యులై యుందురు. అయినను వారి ప్రియపానీయములయొక్క మొదటి ప్రాబల్యకాలమున కాదు. ఆపానీయములయొక్క శమనగుణమువలన నుద్భవమగు గుణములతో బాధపడునపుడు మట్టుకు వారు పైలక్షణములను కలిగియుండుటలో ప్రముఖు లయ్యెదరు.

తేయాకుయొక్క స్వభావమునుబట్టి యది శమనకౌషధమని నేనుచెప్పగలుగుచున్నాను. న్యూయార్కుపట్టణమునందలిదంతవైద్యుడగుడాక్టరు బడ్రెల్ గారు తేనీటినుపయోగించువారి యమిత బలహీనతను గమనించి యీక్రింది పరిశోధనను గావించినారు. ఒక పౌను సువాసనగల (Hyson tea) లేత తేయాకును స్వచ్ఛమైన మృదుజలములో నానవేసి వడియగట్టి మస్టుతీసివేసి, అరపైంటు (6 ఔన్సుల) రసము దిగునట్లు కాచి శస్త్రముచేయవలసిన దంతములయొక్క నాడులకు, బాధ తెలిసికొను శక్తిని తగ్గించుటకును, నొప్పి నొకింత తగ్గించుటకును దిగకాచిన యీ సారమును ప్రయోగించిరి. ఈ పరిశోధనము సంపూర్ణవిజయమును సంపాదించినది. డాక్టరు బడ్రెల్ గారప్పటినుండియు తేనీటిసారము నీరీతి నుపయోగించి దంతవైద్యము



చేయుచున్నారు. కొద్దిగనో గొప్పగనో జనసామాన్యముచేతను దంతవైద్యులచేత నయితము దంతనాడులయొక్క స్పర్శశక్తిని లేక బాధను గ్రహించు శక్తిని తగ్గించుటకును హరింపజేయుటకును వాడబడునట్టి నల్లమందు, లవంగతైలము, (Creosote) క్రియోసోట్, పాషాణము వీనికి బదులుగ తేనీటి నుపయోగించిన పైవస్తువులవలెనే బనిచేయునని వాడుక కలదు.

# తృతీయ ప్రకరణము

## తేయాకు నిజమైన విషము.

శక్తివంతమగు ప్రతి యౌషధమును విషమే కావున తేయాకును మందు దినుసనినను, విషమనినను నొకటియే. ఇక దానిని మందనియు, విషమనియు వేఱువేఱుగ వర్ణింప నవసరమేమని కొందర నవచ్చును. ఈమాట సత్యమేకాని మిక్కిలి సులభముగ తెలియుటకై యీ విషయమును గురించిన నా భావములను రెండు ప్రత్యేక శీర్షికల క్రింద వివరింతును. సారాయము, ఉమ్మెత్తచెట్టు, వసనాభివంటి యొక విషమూలికయగు బెల్లాడోనా మున్నగు ననేకౌషధములు నిర్ణీత రోగముల నొదవించునట్లే తేయాకుగూడ నిర్ణీతమగు తేయాకువ్యాధిని కలుగజేయుటయే యది విషతుల్యమైన దనుట కొక నిదర్శనము. తేయాకును గూర్చిన చర్చలో నీభాగమును లండను పట్టణమునందలి శస్త్రవైద్యుల శాస్త్రపాఠశాలలో ఖ్యాతివహించిన సభ్యుడగు మిస్టర్ జాక్కోల్ గారి పరిశోధనములు చక్కగా తేటపఱుపగలవు. తేనీరు త్రాగువారు

తేయాకు వ్యాధిని కలిగియున్నారని చూపుటకు మిస్టర్ కోల్ గారెన్నడును ప్రయత్నింపలేదు. మద్యసారమును త్రాగువారందఱును త్రాగుడురోగము కలవారని కనబఱచుట యెంత కష్టమో పై విషయమును కనుబఱచుటయు నంతకష్టమే. కాని సారాయములను చవిచూచువారెల్లరు— ద్రాక్షసారాయి రేగుబండ్ల సారాయి, బీరుసారాయి, వీనిని త్రాగునట్టి ప్రతివాడును చిత్తభ్రమరోగముకడకు గొంపోవు బాటలో నున్నట్లే తేనీటిపానము చేయువారెల్లరు తేయాకు రోగమును జేర్చు మార్గములో నున్నారు.

తేయాకుగుణములకు సంబంధించి యొక వింతవిశేషము కలదు. అలసట, బలహీనత, రక్తహీనత మున్నగు కారణములచేత యారోగ్యము క్షీణదశకు వచ్చుచున్న శరీరములను మిక్కిలి సులువుగా బాధించుటయే గాక తేయాకు దీర్ఘకాలమధిక పరిమాణముతో సేవింపబడినయెడల తన హానికరమైన ప్రాబల్యమునకు లోబడదగినంత దుస్థితికి వచ్చునట్లుగా మంచి యారోగ్యదేహమును కూడ క్షీణదశకు దెచ్చును. తేయాకుచే బాధింపబడుటకీ వరకే సిద్ధపడియున్నవారి దేహములలో వ్యాధియొక్క వృద్ధినిగురించి మిస్టరు కోల్ గారీ క్రింది రీతిని వివరించియున్నారు.

"తేనీరు త్రాగినపిదప కొంచెము సేపటికిగాని, యెక్కువ సేపటికిగాని (కొన్ని నిమిషములు మొదలు రెండు, మూడుగంటలలో) జీర్ణాశయము శూన్యమైనట్లు తోచి శీఘ్రముగా భరింపరానిదిగ పరిణమించునట్టి యసౌఖ్యకారియగు నొక



తృష్ణ జనించును. తుదకు కొంచెము కొంచెము తినవలెననిపించు నాకలి, ఆహారవాంఛ యివి తాళవశముకానంతచేటు బాధకరముగ పరిణమించును. కడుపు నిండుగనుండియు, తిండిని నిరోధింప జాలదు; తినుటవలన నీబాధయు శమింపదు.

"చాలకాల మీబాధ యిట్లే యుండును. క్రమక్రమముగా నెడమ ప్రక్కలో పక్షివలె రెపరెప లాడుట యారంభమగును. గుండెలు నిండినట్లుండును. ఊపిరి తిరుగనిట్టూర్పులతో గుండెలలోని యీ నిండుగుండెమీదను, మెడకు క్రిందుగను నుండెడు ఎమ్ముకల యొద్దను, కంఠమూలమునను నెక్కువ ముఖ్యముగ నుండును.

"నల్లని తేయాకు, కాఫీ-వీనిని సేవించినపుడీయుత్పాత క్రమము ననుసరించి విస్తారముగు నుద్రేకము జనించును. ముఖము ఎఱ్ఱబాఱును; అసాధారణకాంతితో కన్నులు తళతళలాడును. సారాయమువలన గలుగు మత్తుయొక్క ప్రథమగుణములన్నియు గోచరించును. నాడి నిండుగనుండి యధికముగ కొట్టుకొనుచుండును, మిక్కుటముగ వేగమును పొందుచుండును. ఆకుపచ్చని తేయాకు వాడినయెడల మొదటి యుద్రేకము తక్కువగనుండును. లేక గోచరింపనంత తక్కువగ నుండును; చర్మము శీఘ్రముగ పాలిపోవును, కన్నులు లోతుకు పోవును, నాడి బలహీనమగును, వేగముగ రెపరెప లాడుచుగాని, మందముగ నీరసముగగాని నడచును.

"వ్యాధి వృద్ధినొందు నపుడే తేయాకును సేవించినను తఱచుగ కాళ్ళు, చేతులు, చలువరాళ్ళవలె చల్లబడి, బంక

చెమ్మటతో తడియుచుండును. మిక్కిలి వేడిమిగనుండు కాలములో సైతము చల్లబడిన యాకాలు నేతులను వెచ్చజేయుటకై చేయబడిన ప్రయత్నములు నిష్ఫలము లయ్యెను తలయొక్క వెనుకభాగమున కూడ చల్లదనము తిమ్మిరి వ్యాపించుచుండును.

ఇది వ్యాధియొక్క మృదుస్వరూపము నేనట్లు పేరిడినట్లయిన ఇది సాధారణముగ చూడబడుచున్నది. కాని మధ్యమధ్య వివిధములగు కీడును హెచ్చించు లక్షణములు పుట్టుచుండును. శిరస్సుయొక్క వెనుక భాగము నందలి చల్లదనము తిమ్మిరి - యీగుణములకుతోడు తలయొక్క చర్మములో చీమలు ప్రాకినట్లుండు (formication) ట, తలలో తీవ్రమైన నొప్పి, దృష్టిమాంద్యము, నడకలో తడబాటు, తలతిప్ప ప్రారంభమగును. ఈగుణములతో పాటు నాడి రెప రెపలాడుచు, నీరసముగ నడచుచుండును గుండెలలోను, గుండెమీద మెడక్రిందనుండు నెమ్ముకలలోను నిండుగ బరువుగ నుండుటకు తోడు శ్వాసావరోధము, (ఊపిరి యాడకుండుట) స్మారకము తప్పుట, వంకరలు పోవుట యనుభయంకరగుణములరాదవును. కడుపులోని బాధలు హెచ్చి తీవ్రమైనట్టి యీడ్పులుగ మారును. గుండెలలోని రెప రెపలాడుట నొప్పిగాను, గుండె వేగముగా కొట్టుకొనుటగాను నీరసముగ కొట్టుకొనుటగాను పరిణమించి మూర్ఛనొందవచ్చును. ఈకీడునుండి మనస్సు తప్పించుకొనలేదని నేనిట చెప్పవచ్చును. శారీరక వ్యాధులలో భాగమును మనస్సు



కూడ పంచుకొనును. రోగియొక్క స్వభావము సులభమగుట, చిటచిటలాడుట యను లక్షణములతో కూడియుండుటయు తద్వారా రోగిచుట్టు నుండువారలకు రోగి పీడవలె కాన్పించుటయు మనము చూచుచున్నాము." మంచి శరీరములో నిన్ని దుర్లక్షణములను ప్రవేశపెట్టునట్టి వస్తువు తీవ్రము తక్కువైనను యథార్థ విషపదార్థమే నని యెవ్వడు కనుగొనడు? ఇది పొరపాటనుట కవకాశ మేమైన కలదా?

జార్జ్ కోల్ గారు తేనీటి పానమువలన వ్యాధిని పొందినట్టి పది వృత్తాంతములను వివరించి యున్నారు. ఆవిషయముల నీ క్రింద నుదాహరించుచున్నాను. వ్యాధి ప్రకోపించినపుడు వినా తక్కినపుడీ శస్త్రవైద్యుడు మందులు వాడకుండ వ్యాధి కారణములగు నాపానీయములను పూర్తిగా వర్జించుట యందే చికిత్స నాధారపఱచి యుంచువాడని మాత్రము ముందుగా చెప్పవలసి యున్నది.

పది వృత్తాంతములలో మొదటి దొక స్త్రీదై యున్నది. ఆమె వయసు ముప్పది యైదేండ్లు, ఆమె భుజించిన వెంటనే కడుపులో నొప్పి కలుగుట, పొట్ట ముడుచుకొని పోయినట్లు వట్టిదియై నట్లు నుండుట, బొత్తిగా నడువ జాలనంత నిస్త్రాణ, ప్రక్కలో రెప రెపలాడుట, గుండెమీదను మెడ క్రిందను నుండు నెమ్ముకలలో నిండుగనుండుట, వాంతి వెడలుట యీలక్షణములతో బాధ పడుచుండెను.

రెండవ వృత్తాంతముకూడ స్త్రీదే. ఆమె వయసు నలువది యేండ్లు. పీనసజ్వరమునుండి యపుడే స్వస్థత గనుచుండెను.

ఒకనాటి ప్రాతఃకాలమున నుదయ భోజనానంతరము వాంతివినా పైన వర్ణింపబడిన లక్షణము లన్నియు నామెను బాధింప మొదలిడినవి. కారణము విచారింపగా నాటి యుదయమున నామె తేనీటి (నల్లని తేయాకు) నెక్కువ చిక్కగా కాచి త్రాగె ననియు వాడుకగ త్రాగుదానికంటె నెక్కువగ త్రాగెననియు తెలిసినది.

మూడవదియు స్త్రీయొక్క వృత్తాంతమే. ఆమెవయసు ముప్పదియేండ్లు. ఆకుపచ్చని తేయాకుతోచేసిన మంచిచిక్కని కషాయమును మిక్కుటముగా త్రాగుట కామె చాలకాలము నుండియు నలవాటుపడియుండెను. మిస్టరుకోలుగారిని పిలువక పూర్వ మొక సంవత్సరము క్రిందట నామెకు కడుపులో తీవ్రమైన యాద్పులు కలిగి తుదకు స్వల్పపరిశ్రమ చేసినను, కొంచెము నడచినను కూడ వచ్చు నంత తఱచుగను, తీవ్రతరముగను పరిణమించినవి. మిస్టరు కోల్ గారు వెళ్ళి చూచునప్పటి కామె యసాధారణమైన తీవ్రవేదన ననుభవించుచుండెను. తేయాకు వ్యాధికి సహజముగ నుండు లక్షణముల నన్నిటిని నామె కలిగి యుండెను. విమర్శనానంతర మామె యీబాధ కంతయు తేయాకే కారణ మని సంపూర్ణముగ నంగీకరించినది. తేయాకు నిషేధ మామెకు విధింపబడినది; అనేకవారములు గడచినను తిరుగ యీాద్పులు రాలేదు. వ్యాధియొక్క యేలక్షణము గోచరింపలేదు. ఒకనాఁ డొక గిన్నెడు తన ప్రియమైన తేనీటిని త్రాగగనే కొద్దిగ ప్రాతవ్యాధి [illegible]ట పడినది. ఆమె మఱల నిషేధ విధానము నవలంబించినది. సుఖముగ నుండగలిగినది.



నాల్గవవృత్తాంతము సైతము స్త్రీదే. ఆమెవయస్సు కూడ ముప్పదియేండ్లే. తేయాకువ్యాధి లేక తేయాకు విషమునకు వాడుకగ నుండునట్టి లక్షణములు, బలహీనత యామెను బాధించుచుండెను. ఆమె త్రాగుచుండిన తేయాకుఆకు పచ్చనిదై యుండెను. ఆమె తేలుకొండి చెట్టువంటి విషౌషధిని, వమనకారియు బలమైన భేదిమందును నగు కుంకుమపువ్వును (medow saffron) నొక పక్షము దినములు వాడి చూచెను. కాని యామెకు సుగుణము కన్పించలేదు సరిగదా బాధ హెచ్చి యిదివఱకు శరీరమును పాడు చేయుచుండిన విషమునకు (తేయాకు) మఱిరెండు విషములు తోడ్పడి నట్లయ్యెను. ఆమె తేయాకును విసర్జించెను. మూడుదినములలో స్వస్థపడెను.

ఐదవదియు స్త్రీవృత్తాంతమే. ఆమెవయస్సు ఇరువదియైదు సంవత్సరములు, ఆమె తేనీటిని పానముచేయుటయందు సుప్రసిద్ధురాలై యుండెను. ఆమెకు మిస్టర్ కోల్ గారు వాడుక ప్రకారము తేయాకు నిషేధమును విధించిరి. వారము దినములు గడచినను నామె బాగుపడక పోవుటచే డాక్టరుగారి కాశ్చర్యము కలిగినది. రోగిని గుఱించి కఠిన పరిశోధన గావించినారు. ఆమె రహస్యముగా తేనీటిని త్రాగుచున్నదని తెలిసినది. ఎట్టకేలకు తేయాకును నిషేధించుట కామె యంగీకరించినది. కొన్ని దినములలోనే బాగుపడినది.

ఆఱవ వృత్తాంత మొక పురుషవర్యునిది. ఆయన నడివయస్సులో నుండెను. గ్రంథకర్తయు, ప్రతినిధిసభా సంబంధమైన వృత్తాంతములను వర్తమాన పత్రికలకు వ్రాయువాడును

నై యుండెను. అతడు ఆకుపచ్చని తేయాకు నీటిని త్రాగుచుండెను. ఒక్కొకప్పుడు చిక్కని కషాయముగ చేసి త్రాగువాడు. తేనీ రాయనకు సామాన్య పానీయమై యుండెను. ఐదారు గంటలసేపు కూడ పనిచేయగల మనోశక్తిని కలిగి యుండుటకు తేనీటి నెప్పుడు త్రాగుచుండెను. వారమునకు రెండుమూడు సారులు స్మారకము తప్పి నేలపై బడియుండునంత దుస్థితికి వచ్చునట్లాతడు తేనీటికి బానిసీడై పోయెను.

ఏడవవృత్తాంత మొక నడిప్రాయపు పిల్లల తల్లిది. సాయంసమయములలో నపుడపుడు స్మారకము లేకుండ మూర్ఛలోమునిగి యుండుటతో కొంత కాలమునుండి యామె బాధ పడుచుండెను. దినమునకు రెండుసారులు నల్లని తేయాకు నీటిని త్రాగుట కామె యలవాటు పడియుండెను. మిస్టర్ కోలుగా రామె బాధకు తేయాకే కారణమని యనుమానించి తేయాకు నిషేధమును విధించిరి. వెంటనే యామె స్వాస్థ్యమును పొందెను. అదివఱకు బలమైన మందుల నెన్నిటిని తినినను నామెకు సుగుణము కనుబడలేదు.

ఎనిమిదవ వృత్తాంత మొక దుకాణదారునిదై యున్నది. అతడు తేనీటినేగాక కాఫీనికూడ మిక్కుటముగ త్రాగుట కలవాటుపడి యుండెను. అందఱకంటె నెక్కువగా నతనితలలో బాధ కలిగెను. కాఫీ, టీ రెండును నిషేధింపబడినవి. మంచినీటిని త్రాగుటకుమాత్రమతని కనుమతి యీయబడినది. ఒక పదిదినముల పాటు జటామాంసి యను నోషధిని కొద్దిగా వాడ నిచ్చితిని.



తొమ్మిదవ వృత్తాంత మొక యువకునిది. అతని వయస్సు 22 సంవత్సరములు. ఇంత చిన్నతనములోనే యతడు పెద్దనల్ల తేనీటి త్రాగుబోతై యుండెను. తక్కిన తేనీ రోగచిహ్నములకు తోడుగా తుదకతని ముక్కువెంట రక్తముపడుట, ఈడ్పులు (వంకరలు పోవుట) ప్రారంభమైనవి. సాధారణపద్ధతి ననుసరించి కడువేగముగ నతనికి గుణము కలిగినది.

పదియవ వృత్తాంతము చివరివృత్తాంతము. ఇదియొక నారీమణివృత్తాంతమై యున్నది. ఆమె తేనీటిపాత్రికు శ్రద్ధాళువైన బానిసయైయుండెను. చాలకాలమునుండి బాధపడుచుండియు నామె బాధకు హేతువైనదానిని వర్జింపదాయెను. తుదకు కళ్ళెతో కలసి రక్తము పడునట్టి కఠినమైనదగ్గు పుట్టుటచేత నామె తేనీటిపానమును మానివేయవలసిన దాయెను. జాన్ కోల్‌గారీ క్రిందిరీతిగా చెప్పి తమ వృత్తాంతవివరమును ముగించిరి. "ఎదురువాదమున కేమాత్రము నవకాశము లేనంత నిదర్శనము నీయగలన్ని వృత్తాంతములను నేను వర్ణింపగలను. కాని యిపుడు వివరించిన వృత్తాంతములు "ఈపానపాత్రిలు ఉల్లాసము నిచ్చునేకాని మత్తు కలుగజేయవు" అని పొగడబడు నిరపాయకరము లగు పానీయములనుగూర్చి తగినంత సందేహమును ప్రేరేపించుటకు మట్టుకు చాలియున్నవని నా తలంపు. ఒక యువయువమునకు నిరాటంకముగా నెడతెగకుండ తొందర కలుగుచుండిన, దాని నిర్మాణమునందు మార్పు కలుగుట సత్యమేయైనచో ప్రతిసారి లోపలికిపోయిన మూడు నాలుగు ఘంటలలో హృదయధర్మమును చెఱిపివేయునట్టి

వస్తువును దినమునకు రెండుసారులు యేలాభమును కోరి మనము సేవించవలయును? శరీరనిర్మాణ సంబంధవ్యాధి జనించుటకీ వస్తువు (తేయాకు) కారణమని చెప్పెదరేమో కాని యిటీవలి వత్సరములలో హృదయవ్యాధి ప్రబలమగుటకు కాఫీ, టీ వీనియొక్క వాడుక విస్తారమగుటయే కారణము కాదా యని ప్రశ్నించుట కవకాశము కలుగుచున్నది. కొలుగా రొక్కరుమాత్రమే తేయాకు విషయుత మని చెప్పుట లేదు. పూర్వార్థ పశ్చిమార్థ గోళములు రెంటియందును వసించునట్టి ప్రసిద్ధపురుషులు తేయాకువిషయమైయిట్టి యభిప్రాయములు కలవారై యున్నారు. వారియందనేకులు పరిశోధనమూలమున నవన్నియు నిజమని నిరూపించియున్నారు. మానవ జీవశాస్త్రమునుగూర్చిన యుపన్యాసములలో గ్రాహమ్‌గారిట్లు చెప్పియున్నారు. "1767 వ సంవత్సరము నాటికే ఎడింబర్గునందలి డాక్టరు స్మిత్తుగారు ఆకుపచ్చని తేయాకుకషాయము (Henbane) హెన్‌బేన్ అనబడు కురాసాని వాముపుజాతి విషవృక్షము, పొగాకు (Cicuta) సిక్యుటా యనబడు విషౌషధి మున్నగునవి సజీవశరీరములయొక్క కండరముల యల్లికలపై నెట్టిగుణమును కలుగజేయునో అట్టిగుణమునే సూటిగా కలుగుజేయు ననియు, పై వస్తువులు ప్రతివిషయమునను మొదట ప్రాణధర్మములను క్షీణింపచేసి తుదకు వినాశమును కలుగుజేయు ననియు జాగ్రతగా చేయబడిన బహుపరిశోధనముల మూలమున నిరూపించియుండెను. "1772 సం॥ లో ఐర్లాండునందలి డాక్టరు లెట్సమ్‌గారును నీరీతిపరిశోధనములనే



కావించి యీమాదిరి ఫలితములనే గాంచియుండిరి. అటుతరువాత ఇంగ్లాండు వాస్తవ్యుడగు డాక్టరు బెడ్డోస్‌గారు మాటిమాటికి చేసినవేమఱల చేయుచు నెన్నని పరిశోధనములు చేసి లారల్ అనబడు పొన్నవంటి చెట్టుయొక్క ఆకుకషాయము, నల్లమందు, తేలుకొండి మొక్కవంటి విషౌషధ యివి ప్రాణమును వినాశపఱచుట యందెంత శక్తివంతములో తేయాకంత శక్తివంతమై యున్నదని సంపూర్తిగా నిరూపించెను. కాఫీయొక్కగాని, తేయాకు యొక్కగాని చిక్కని కషాయము కొంచెమే యైననుకూడ నలవాటులేని మానవ ప్రాణమును సమానపరిమాణముగల నల్లమందు ద్రావకమెంత శీఘ్రముగా హరించునో అంతశీఘ్రముగా హరించును. ఇది సంపూర్ణముగా యథార్థము." డాక్టరు బెడ్డోసుగారు బ్రతికియున్న కప్పల నుండి యప్పుడేతీసిన గుండెలమీద తేయాకుతో చేసిన చిక్కని కషాయమును ప్రయోగించిరి. తత్క్షణమే యాగుండెలయొక్క ప్రాణస్పందము నాకషాయ మంతరింపజేసెను.

స్కాట్లండు దేశపువైద్యుడగు ఘనతఁబొందిన డాక్టరు కుల్లెనుగారి గ్రంథములు ఉత్తమవైద్య విద్యాలయములలో ప్రమాణగ్రంథములుగ నున్నవి. అట్టి కుల్లెనుగారిట్లు కనిపెట్టి వ్రాసినారు. "ఆకుపచ్చని తేయాకుకషాయము నాడులయొక్క స్పర్శశక్తిని కండరములయొక్క ప్రేరేపకశక్తిని నశింపజేయునని శాస్త్రీయములైన పరిశోధనలవలన తెలియబడినది." ఆకుపచ్చ తేయాకు గుణమేకలదై యింకను చుఱుకుగ పనిజేయునట్టి

నల్లతేయాకునుకూడ విడిచిపెట్టకుండ వారింకను నిట్లు వ్రాసియున్నారు. "పైన పేర్కొనబడిన పరిశోధనల మూలమునను 50 సంవత్సరముల కాలము సకలరకముల మనుష్యులకును వాడి శ్రద్ధతో పరిశీలించి కనుగొనిన విషయముల మూలమునను నాకు తేయాకునందు నిద్రావహమును, ఉపశాంతికరమునగు ద్వివిధ లక్షణములున్నవని నమ్మకము కలిగినది." నిద్రావహములనగా నెట్టివని డాక్టరుకుల్లెనుగారు తలచెదరో చూడుడు. "సాధారణముగా నిద్రావహములు తమయొక్క శక్తిచేతను క్రియచేతను ప్రాణధర్మములను పరిపూర్ణముగా నశింపజేయు నంతగకూడ పనిచేయగల్గుసు. విషయుతములని నిర్ణయింపబడిన వస్తువర్గములో నీ నిద్రావహములు చేరుచున్నవి."

జీర్ణక్రమము, పథ్యములు అను గ్రంథములో డాక్టర్ కూమ్బె (combe) గారిట్లు వ్రాసియున్నారు. "కాఫీ, తేనీరు రెండు పానీయములును మిక్కిలి చిక్కగాచేసి యెక్కువగా త్రాగినట్లయిన ముఖ్యముగా పొద్దు గ్రుంకునపుడు త్రాగినట్లయిన పొట్టకు కీడు చేయుటయే గాక నాడీ మండలము యొక్కయు, మెదడు యొక్కయు నారోగ్యమును పాడుచేయును."

అమెరికా నానా శబ్దార్థ సర్వస్వ మిట్లు చెప్పుచున్నది. "మానవశరీరమునకు తేనీరు కలుగజేయు గుణము లెవ్వియనగా స్వల్పముగ సేవించినపుడు స్వల్పనిద్రను తెచ్చుట. అనగా నుల్లాసమును పుట్టించుట." నోటు 1. పుట 99.



ఆరోగ్యవిషయికప్రశ్నోత్తరగ్రంథమునకు కర్తగాతలంపబడుచున్న ఫిలడల్ఫియా వాస్తవ్యుడగు డాక్టరు బెల్ గారిట్లు చెప్పియున్నారు. "తేయాకు (నల్లని, ఆకుపచ్చని తేయాకు రకములు రెండును అని వారితాత్పర్యము) కషాయమును చిక్కగా కాచి యెక్కువగా త్రాగినయెడల అన్నాశయము యొక్క శక్తులనెల్ల చెడిపివేయును. వివిధములైన బలహీన లక్షణములను కలుగజేయును."

"జీర్ణవ్యాపారము, దానియొక్క లోపములు" అను గ్రంథములో న్యూయార్కు నివాసియగు పండిత స్వీట్సర్ గారు నల్లని, ఆకుపచ్చని తేయాకురకములు రెంటినిగూర్చి యా యాకులలో ఆవిరి యయ్యెడు నూనెయుండుటచేత నవి నాడీ మండలమున కుద్దీపనము నిచ్చునని వ్రాసియున్నారు. జాన్ కోల్ మున్నగువారు వర్ణించిన గుణములనెల్ల దాదాపుగ పేర్కొనినపిమ్మట ఆగుణముల కెల్ల కారణము కేవలము తేయాకేననుటను విడిచియితర కారణములను చూపుట వైద్యుల యాచారమైనట్లుగ్రహించి యిట్లు వ్రాసిముగించిరి. "తేయాకుయొక్క విచిత్రస్వభావములకే కీడంతయు నారోపింప బడవలయునని నేను కోరుచున్నాను." డాక్టర్ హూపర్ గారు తమ వైద్యనిఘంటువులో నిట్లు వ్రాయుచున్నారు. "తేయాకుచెట్టు దాని సహజస్థితిలో నిద్రావహమగు నోషధి యనగా మత్తుమందు చెట్టయియున్నది. ఈకారణముచేతనే దీనిని కనీసము పండ్రెండునెలల వఱకైనను నిలువయుంచనిదే చైనావారు సేవింపరు. (నిలువచే దానిమత్తుగుణమును పోగొట్టి పిమ్మట

వాడుకొందురు.) విస్తారముగా త్రాగినచో నిద్రావహములగు నౌషధు లన్నిటివలెనే తేయాకు బలహీనము, కంపము, పక్షవాతము, తిమురువాయువు మున్నగు నెన్నియోవ్యాధులను పుట్టించును.”

న్యూయార్కుపట్టణ కాపురస్థుడగు డాక్టరు బరెల్ గారు “నే నెఱిగినంతవరకు మైకమునునొదవించు పానీయముల (కాఫీ, తేనీరుల) ను త్రాగినవారి కొక్కరికైనను తలనొప్పి రోగము వచ్చియుండలేదు. ఈపానీయములను పూర్తిగా మానివేసిన పిమ్మట నొక్క తలనొప్పిరోగికైనను రోగనివారణము కాకుండ నుండలేదు.” సంయుక్తరాష్ట్రసైన్యమునందు శస్త్రవైద్యుడును తన పరిశోధనములతోడ ఔషధవైద్యులందఱియొక్క శ్రద్ధ నాకర్షించినవాడును నగు డాక్టరు బ్యూమోంటుగా రిట్లు చెప్పియున్నారు. “అన్నితరగతులవారికిని సామాన్యపానీయములై యున్న కాఫీ, తేనీరు ఇవి జీర్ణావయవములను దుర్బలపఱచునట్టి స్వభావము కలవైయున్నవి. కాఫీ, తేయాకు వీనిలో నొకదాని తేలికకషాయమును త్రాగుట కలవాటుపడినవారిని చిక్కగాచేసిన కషాయమును 2, 3 గిన్నెలు త్రాగనిండు. దానియొక్క హానికరమైన స్వభావము వారికి వెంటనే బోధపడును. అయినను వారు విడువకుండ వాడుచున్న మైకము నొదవించు మందున కిది (చిక్కగచేయుట) బలమునిచ్చును.” డాక్టరు బ్యూమోంట్ గారు తేనీటిని, కాఫీని కూడ మైకముకలుగజేయువస్తువు లని పిలుచుచున్నారని పాఠకులు గమనింపవలయును. బహుజనులతో పాటు వీ రొసగిన



ప్రమాణము కేవల సిద్ధాంతస్థాపనమునకుగాక పరిశోధనాఫలితముగామాత్రమె శుద్ధశాస్త్రీయ విషయముగమాత్రమె యున్నదని తెలిసికొనబడినపుడది మిక్కిలి యెక్కువప్రయోజనకారి కాగలదు.

మఱియు ఆకుపచ్చని తేయాకు మైకమును బాధోపశమనమును కలుగజేయునట్టి విషయుతము లైనట్టి లక్షణములు కలదగుటచే కాల్పులను, కాలుటవలన నైన పుండ్లను మాన్పుటయందు మిక్కిలి సామర్థ్యముకలదై యున్నదని కొన్నిపత్రికలు చెప్పుచున్నవి. ముఖ్యముగా బోస్టన్ ఔషధ, శస్త్రవైద్యపత్రిక నుడువుచున్నది. ట్రాన్సిల్ వేనియా ఔషధపత్రిక యీ తేయాకును నొప్పిని శమింపజేయు నౌషధమని చెప్పుచున్నది. నిజముగ నది యట్లే కొన్నివిషయములలో పనిచేయుచున్నది. మఱికొన్ని వ్యాధుల కీ తేయాకు నల్లమందువలె నుపయోగపడుచున్నది.

కాని నేనుచెప్పిన దింకను పూర్తికాలేదు. వర్తకవ్యాపార సంభ్రమమున దగుల్కొని యున్న లోకమునుండి యీ క్రింది విచిత్ర, సంతోషకథనములు వెల్వడినవి.

లండను త్రైమాసిక విమర్శన గ్రంథము చైనాలోని కాంటన్‌నందు పనికిమాలిన రకమైన నల్లని ముతక తేయాకును ఇనుముపైన తగుమాత్రముగ వెచ్చజేయుట ద్వారా ఆకుపచ్చని తేయాకుగా మార్చి (ట్యూమెరిక్కు) నీలిమందు, తెల్లసీసము వీని మిశ్రమమును చేర్చి తద్వారా బదరీఫలవర్ణమువలె నవనవలాడు నీలకాంతితో కోమలమైన ఆకుపచ్చని తేయా

కులవలె ఉంగరములుగా చుట్టుకొనియుండునట్లు సిద్ధముచేయుచున్నారని తెల్పుచున్నది. ఆగ్రంథకర్త యీకృత్రిమపదార్థమును (మార్పబడిన తేయాకును) 50,000 ఏబదివేల పెట్టెల నిండ నింపి యోడలకెక్కించుట తాను స్వయముగా చూచి యెచ్చటికెగుమతి చేయుచున్నారని ప్రశ్నించి అమెరికా బజారున కని ప్రత్యుత్తరము బడసితి నని వ్రాయుచున్నాడు. ఆగ్రంథములో 2 వివరణము 102 పుట చూడుడు.

తక్కిన కథనములు తేయాకులో ప్రషియన్ నీలము ఫ్రెంచి సున్నము కలియునని చెప్పుచున్నవి. ఈవిషయ మెంత వఱకు సత్యమో కాని దిగుమతి యగు తేయాకు రకములలో విస్తారభాగము తేయాకు చెడిపోయినదియు, పనికి మాలినదియు, బజారు అమ్మకమునకు తగియుండునట్లు తయారు చేయబడినదియు నని మనము సంశయించుటకు వలసినంత హేతువు మాత్రమున్నది. అమెరికావారికి తేయాకు తప్పకుండ కావలయును. సాహాయ్య పరులైన జనులు కావున చైనావారు దాని నిచ్చుటకు సిద్ధముగా నున్నారు.

ఆకుపచ్చని తేయాకు విషయుతమని నిరూపింపబడినచో నీ ప్రమాణము నల్లని తేయాకు విషయుతము కాదన జాలదు. కాని నల్లని తేయాకు కూడ విషయుతమైనదేనని నిరూపించుటకుగా ననేకమంది గ్రంథకర్తల యభిప్రాయములను నేనుదహరించియున్నాను.

సుప్రసిద్ధరసాయనిక శాస్త్రవేత్తయగు బ్రాక్డీ గారు రోగికి ప్రయోగించి స్వయముగ చేసిన పరిశోధనము



ద్వారా ఆకుపచ్చని తేయాకులు నల్లని తేయాకులు నను నీరెండు రకముల తేయాకుల మధ్య నీవిషయమై ప్రత్యేకభేదమెద్దియు లేదని నిశ్చయించి చెప్పుచున్నారు.

అయినప్పటికిని ప్రస్తుతము కొంతసేపు నల్లని తేయాకు హానికరము కాదని యొప్పుకొందమనుకొనుడు! ఈరకము తేయాకెంత స్వల్పపరిమాణము మనచే స్వీకరింపబడుచున్నది? ఈక్రింది వివరణ పట్టిక ననుసరించి దిగుమతియగుచున్న వివిధములగు నల్లతేయాకుల పరిమాణము మొత్తములో నిరువదింట నాలుపాళ్లున్నవి.

| | మొత్తములో |
|---|---|
| బోహియా, | 1—20 th |
| సౌచాంగ్, తక్కిన నల్ల తేయాకురకములు | 5—20 ths |
| హైసన్, లేతహైసన్ | 9—20 th |
| హైసన్‌స్కిన్, తక్కిన ఆకుపచ్చని తేయాకులు | 4—20 ths |
| ఇంపీరియల్, గన్‌పౌడర్ | 1—20 th |

# చతుర్థప్రకరణము

## తేయాకునందలి రోగప్రవణత.

తేయాకు మందుదినుసని చెప్పటలో తేయాకుయొక్క స్వభావమును జాక్ కోల్ గారు పేరిడినట్టి తేయాకు రోగమును కలుగజేయు స్వభావమును తుదకెట్లయినను నిరూపింపగలిగితిని. తేయాకు మందుదినుసను శీర్షికక్రిందను మఱియొక శీర్షికక్రిందను కూడ తేయాకుయొక్క తలనొప్పి, అజీర్ణము మున్నగు రోగములను కలుగజేయగల శక్తిని గూర్చి మిక్కిలిగా నుదాహరించియున్నాను. ఈప్రకరణము నందు ముఖ్యమైన విశేషాంశములను వివరించుటకు ప్రయత్నించెదను.

తేయాకు దంతములకు కానరాని హానిచేయును. అకాలక్షయము నుత్పాదిల్లజేయును. వెచ్చని చల్లని, తియ్యని, ఒగరైన, కారము కలిగి తీక్ష్ణమైన వస్తువులు దంతములకు తగిలినచో దంతములకు చెఱుపుకలుగునను పామరవిశ్వాసము సత్యమైనది కాదు. తుదకు రసము, కురాసానివామపు జాతి విషౌషధి, హెమ్లాక్ అను విషౌషధి ఇవికూడ దంతములను చెఱుపజాలవు. దురదృష్టవశాత్తు మిక్కిలి తీక్ష్ణమును, మిక్కిలి కేంద్రీకృతమును నగు నమ్లముతో సంబంధము కలిగినచో దంతములకు హాని వాటిల్లును. అయిన నీహాని సాధారణముగ తిన్నగా కాకుండ కలుగుచునేయున్నది. ఈవిషయము నిక చర్చింతము. చిగుళ్ళకు హాని చేయునవన్నియు సరాసరిగా దంతములకు హానిచేయునను సిద్ధాంతము ఔషధవైద్యులెల్లఱు సర్వసాధారణముగా నంగీకరించినయంశమైయున్నది. నోటబ్రవే



శించువస్తువులనేకము చిగుళ్ళకు హాని చేయునవైయున్నవి. మిక్కిలి వేడిగగాని మిక్కిలి చల్లగగాని యుండు ప్రతిపదార్థమును నిట్లుచేయును. తేనీరు సాధారణముగా వేడిగ నుండునపుడె త్రాగబడును. అందువలన చిగుళ్ళలో రోగమును పుట్టించి, దంతములలోపల నెమ్ముక పుచ్చెడు వ్యాధి నుద్భవిల్లజేయును. నేను సూచించిన కీడు మూడుటకిది యొక కారణము.

కాని దంతములు సరాసరిని పొట్టగుండ హానిని పొందుచున్నవి. ఏసన్నని పొర నోటిలోపలి భాగమున నుండునో ఆపొరయే పొట్టవఱకును వ్యాపించి పొట్టలోపలనుండును. పొట్టకు కీడుచేయు కారణములన్నియు సమాన పరిమాణముతో దంతములకు కీడుచేయును. వేడివేడి పానీయములు, చల్లని పానీయములు పొట్టకు కీడు చేయు పదార్థములలో చేరియున్నవి. ఇందుమూలమున నేను దేనిని గూర్చి యిపుడు చెప్పుచున్నానో ఆవేడి వేడి తేనీరు దంతవ్యాధుల నొదవించుటయందు రెండు రెట్లు కర్తృత్వము కలదైయున్నది.

వేడివేడి పానీయములు ఎమ్ముక పుచ్చెడు వ్యాధి నొదవించి దంతములకు, చిగుళ్లకు కీడుచేయుననుట కొకనిదర్శనము జిల్లుమను చల్లనిమేత, మిక్కిలి వేడి మేతమేయుచు నగరములచెంత వసించు నావులను పరీక్షించుటవలన లభించినది. ఈవిషయికమగు నాందోళనము న్యూయార్కు పట్టణమున ప్రబలిన కొన్ని సంవత్సరములనుండి తత్ప్రాంత గోశాలలలోని గోవులయొక్క దంతములు పరీక్షింపబడినవి. అందుపై కలిగిన ఫలితములు ఆశ్చర్యకరములు. సహజాహారముతో పెంపబడిన

గోవుయొక్క దంతములు సంపూర్ణారోగ్యముతో కూడియుండెను. చిగుళ్ళనుండి బైటికివచ్చియుండు దంతములమీద మెరయుచు గట్టిగనుండు దంతికయు చాల బాగుగానుండెను. దంతములకు గూండ్లై వానికాధారముగ నుండునట్టి దౌడయొక్క భాగములు (Alveolar Process) కూడ ఆరోగ్యముగనుండెను. దంతముల సందులలో పాచి లేనేలేదు. పాచి లేకపోవుటయేగాక దంతములు దృఢముగను, తెల్లగను నుండెను. కాని చల్లనిదై దగ్గఱనున్న బట్టిలో వేడి యెక్కింపబడినదై యుండు మేతమేపి పెంపబడిన గోవుయొక్క దంతముల ధావళ్య మదృశ్యమైనది. అనగా వానిమీది దంతిక నశించినది, కేవలము దంతిక హరించిపోవుటతో నాగలేదు. దంతములందలి యెముకకలకు సైతము బాధకలిగి వానియొక్క సహజపరిమాణము తగ్గిపోయినది. దంతములపై నల్లమచ్చలు ఏర్పడసాగి యవి పుచ్చిపోవుట కారంభించిన సంగతి నెఱుకపఱచినవి.

దౌడలును వ్యాధిగ్రస్తములైనవి. దంతమూలములలో కుఱుపులు లేచినవి. దంతమూలముల కెదురుగ నుండు దౌడ యెముక చెడి పగిలిపోయినది. ఒకపన్ను బొత్తిగా కనుబడకుండపోయినది. ఎద్దుది పొట్టయొక్క లోపలి భాగము నావరించియుండు సన్నని పొర కధికమైన హానిని కలుగజేసి దంతములయం దది ప్రత్యక్షమగునట్లు చేయుచున్నదో యది తప్పకుండ శరీరమధ్యావయవమగు పొట్టయొక్క నాడులకెల్ల కీడుచేయును. కేవలము పొట్టయందేగాక దానితో నెక్కువ సంబంధము కలిగి పనిచేయుచుండు ప్రతి యవయవమునందును



వ్యాధి నొదవించును. అజీర్ణరోగము, దుర్బలత్వమువలనఁ గలుగు శిరోభారము, హృద్రోగము, పక్షవాతము, మూర్ఛ, పేరొక్కనగలిగినన్నిరకముల బలహీనతలు, అన్నిరకముల నాడీరోగములు యివన్నియు నొక్కొక్కప్పుడు నిక్కముగా తేనీటి పానమునకు ఫలములై తలచూపును. ఈవ్యాధు లొకవేళ కారణాంతరములవలన జనించినను తేనీటిపానమువలన నవి మిక్కిలి వృద్ధిపొందియే పోవును. ముఖ్యముగా పక్షవాతసంబంధమైన వ్యాధులు బలహీనతచే కలుగు తలనొప్పి తేనీటి పానమువలన జనించును. తేనీటిపానిసను సైతము తేనీరు తలనొప్పిని నివారించునని తలపనీయకుడు. తేనీరు తాత్కాలికోపశాంతి నీయగలదు. అనేకమారులట్లిచ్చియున్నది. ఇది నిజమే కాని వ్యాధిమాత్రము నిరాతంకముగా వృద్ధి నొందింపబడినది. అంతియేకాక తేనీటివలన తఱచుగా నితరరోగ బీజములు కూడ శరీరక్షేత్రములో చేర్చబడుచున్నవి. దంతక్షయము, జీర్ణాశయవ్యాధి యివి యితరకారణముల వలనకూడ శీఘ్రముగా కలుగును. జంతుకళేబరమునందలి తక్కినభాగముల వలెనే దంతములుకూడ తుదకు మితముగనైనను పనిచేయుట వలన నెక్కువ బాగుగ నుండగలవు. ఎవ్వరు తమయాహారమును తేనీటితో లోనికి దింపివేయుచున్నారో, వారు ఎంత తేనీరువాడెదరో అంతతక్కువగ నమలెదరు. కావున దంతక్షయమును స్వయముగా కలుగచేసికొనుచున్నారు. ఈకారణము చేతనే అనగా ఆహారము సరిగా నమలబడక, ఉమ్మినీటితో కలియక లోనికి ప్రవేశించుటచేతనే సరిగా జీర్ణమగుటలేదు. డాక్టర్

ఆర్బుత్‌నాట్‌గారిట్లు చెప్పుచున్నారు:— "ఘనపదార్థమును జీర్ణకోశములో ప్రవేశించుటకు తగినదానినిగా సిద్ధపఱచుటకు నమలుట ముఖ్యావశ్యకము. నమలకపోయినచో సరిగా జీర్ణము కానేరదు." చక్కగ నమలినచో ఘనపదార్థము మఱెద్దియు కలుపకపోయినను బాగుగ తడుపబడును. అట్లు నమలకుండ వేడిపానీయములను, చల్లనిపానీయములను మిక్కుటముగా మ్రింగుచుండిన గర్భములోపలనుండు పీల్చునట్టియుపకరణములకు భార మగును. మితిమీరి లోపల ప్రవేశించిన ద్రవపదార్థమును మోసికొని పోవుటకు దానిలోని ప్రాణశక్తులన్నియు విస్తరిల్లి పనిచేయవలసియుండును. ఇట్లు బలహీనమైన జీర్ణకోశముచే ప్రారంభింపబడి, జరుపబడు జీర్ణవ్యాపారముండవలసినంత యసంపూర్ణముగ నుండక తప్పదు. ఇందుమూలముననే కడుపు నిండుగ నుండుట, గాలిపోవుట, కడుపుబ్బరము, వేడిగనుండుట, పుల్లదనము, నొప్పి యీలక్షణము లొదవును. మఱియు నిందుకు తుదిఫలితములుగా కాలికతాపములు, స్కిర్రిస్ (Schirrus), కొఱుకుపుండు ఇంక ననేకరోగములు ప్రబలి బాధించును. తేనీటిపానముచే నొదవు దుష్ఫలితములలో కొన్ని యమితభారముతో స్త్రీలపై బడుచున్నవి. తేనీరు త్రాగకుండ నొక్కదినమైనను గడపజాలమని తలంచు స్త్రీలెందఱో తేనీటిపానము వలననే చలికాళ్ళు, చలిచేతులు, పీనసరోగప్రవణత, వింతవింత వేదనలు, ముఖ్యముగ బలమును హరించు బాధలు, ఆకలిలేమి—యీవ్యాధులను గొని తెచ్చుకొనుచున్నారు. తేనీరు క్రమక్రమముగా క్షుధనెల్ల నశింపజేయుచుండ తేనీరు త్రాగువారు తఱచుగ మితభోజులై యుండు టొకవింత కాదు.



పూర్వులు తేనీటిని త్రాగుటవలన వారిసంతానము వంశపారంపర్యముగా గండమాల వ్యాధిసంబంధ మగు శరీరప్రకృతిని పొందుటకు కారణము కలుగుచున్నది. తల్లియొక్క నాడులను, ముఖ్యముగా గర్భనాడులను దుర్బలపఱచునట్టి దేదియో యది యామెసంతానమునకు వంశపారంపర్యముగా ననుభవించుటకు స్వత్వమైన రోగప్రవణతను కలుగజేసి తఱచుగా గండమాలయో, క్షయవ్యాధియో కలుగుటకు హేతుభూతమగుచున్నది.

ఇంద్రియములు లేక, ఇంద్రియజ్ఞానములకు నిలయములగు నవయవములు ముఖ్యముగా చూపు, రుచి యీరెంటికి స్థానములగు నవయవములు మెల్లగా పనిజేయునట్టి తేనీటివిషమువలన బాధింపబడును. తేనీటిపానముచే వెంటవెంటనే సంభవించుచుండు పడిశభారమువలన ప్రత్యక్షముగనో, అప్రత్యక్షముగనో వినికిడి శక్తికిచేటు వాటిల్లును. ఒకొ్కకపుడు కంఠస్వరముకూడ మారును. కాని పైనవివరింపబడిన వానియన్నిటికంటె నీమార్పు చాల తక్కువగ కలుగుచుండును.

ఆకుపచ్చని తేయాకువలె నల్లని తేయాకును, తేయాకుయొక్క తేలికకషాయమువలెనే చిక్కనికషాయమును సరిసమానముగ రోగకారణములని యొక్క నిమిషకాలమైనను తలపఁబనిలేదు. కాని రెండురకముల తేయాకులును, అన్నిరకములగు (తేలిక, చిక్కని) కషాయములును కొద్దిగనో, గొప్ప

గనో రోగకారణములే నని మాత్రము నమ్మవలయును. ఏమన నన్నిరకముల తేయాకుల యొక్క అన్నితరగతుల కషాయములును కొద్దిగనో గొప్పగనో విషయుతములే యై యున్నవి.

---

## పంచమ ప్రకరణము

### తేయాకువలన బుద్ధికి కలుగు కీడు

తేయాకు మెదడునందు, నాడులందు మార్పుకలుగ జేసి, సాధారణముగా బలహీనమని పిలువబడు నవస్థను మాత్రమేగాక కఠినములగు నాడీవ్యాధులను కూడ పుట్టించి, తెలివికి మధ్యవర్తులగు నింద్రియములకు కీడుచేయగలదేని యది తప్పకుండ తెలివియని పిలువబడు మానసిక శక్తులకుకూడ కీడు చేసితీరును. అనంతరకాలమున తెలివిని సబ్బపఱచుస్వభావము తేయాకునం దున్నదని బొత్తిగా తెలియమి ననేకవేల ప్రజలు తమ తెలివికి పదనుపెట్టుటకై తేనీటిని త్రాగుచున్నారు. ఇది నేనెఱుగని సంగతికాదు. కాని యిందువలన తేయాకు ప్రయోజనకారియని యెంతమాత్రము నిరూపణము కాబోదు. బ్రాందీ, పొగాకు, నల్లమందు యివి తెలివికి చుఱుకుబుట్టించు నని యథార్థముగ విశ్వసించువారివలెనే తేనీటిపానమును విశ్వసించువారును దాని యుపయోగ మావశ్యకమని నిరూపింపజాలరు. మఱియు తేనీటిపానమువలన మొదట



ఇంద్రియజ్ఞానము వికాసము నొందుటచేత భావములకు విపరీతమైన చుఱుకుదనమొదవి, వాక్కు నిరాఘాటముగ వెడలును. ఇదంతయు తేయాకుగుణమునందు మనకు సందియము కలుగుటకు మట్టుకే పనికివచ్చును. దాని నుపయోగించు ప్రతి వ్యక్తియొక్క మనస్సును తుదకు నిస్సంశయముగా మొద్దుబాఱును.

అమెరికా దేశపు భాషాకోవిదులలో నొక వ్యక్తి పానాభ్యాసమువలన నొదవినదియు, మధ్య మధ్య విపరీత మనోవికారముతో మూర్ఛలో మునిగియుండునట్లు చేయునదియునగు నమితమనోమాంద్యముతో చిరకాలము పడియుండిన పిమ్మట తిరుగ తేనీటిపాత్రను సేవించుచుండెను. అట్లు తేనీటిని పానము చేయుటచే మఱల కొలదికాలము మిక్కిలి యుద్భ్రాంతావహమగు మానసిక పరిశ్రమను చేయుచు అటుపై మఱల క్రుంగిపోయి మధ్య మధ్య కొంతకాలము నిశ్చేష్టముగనుండు నొకానొక జంతువువలె కడు దీర్ఘకాలము జీవచ్ఛవమువలె పడియుండుచుండెను. కడకతఁడకాలమృత్యువు నొందెను. డాక్టర్ జాన్సన్‌గారు వేరొక దేశమున వేరొకశతాబ్దములో నుండిన వేరొకభాషాకోవిదుఁడు. వీరుకూడ తేనీటిని మితిమీఱి గ్రోలుటవలన వినాశము నొందకున్నను తెలివితేటల క్షాయముకలిగి నష్టపడిరని విశ్వసింపబడుచున్నది. ఇతర వృత్తాంతము లిట్టివింకను గలవు.

---

# షష్ఠమ ప్రకరణము

## నైతిక స్వభావముపై తేనీటి గుణములు

తేనీటిపానము చేయు వేనవేలు ప్రజలలో చాలమంది తెలివిమాలిన యలవాటని తెలిసికొనినారు. తేనీరు త్రాగుట సంపూర్ణముగ తప్పు అని విశ్వసించువారు సైతము కొందఱు కలరు. అయిన నింకను దానియందు దోషదృష్టి కలిగియు ననేకులు దానిని మానలేకున్నారు. చేయకూడనిదని తెలిసికొనినపనిని ప్రతిదినము చేయుట యవినీతియనియు, క్రైస్తవులును, తక్కినవారెల్లఱును నెయ్యది యయుక్తము, నవివేక కార్యము నగు నలవాటో యట్టిదానినెల్ల పరిత్యజించి ఈశ్వర మహిమను ప్రకటించుదానినెల్ల యాచరించుట కర్తవ్యమను విధికి లోనై యున్నారనియు ఋజువు చేయ నవసరములేదు. ఈయంశమును దెలియజేసి దీనిని పాఠకుని వివేకమునకు వదలి వేసినఁ జాలును.

తేనీటి నమితముగ త్రాగనెంచుట యవినీతియని తెలుపుటెంతకంటెను ముఖ్యము. జితేంద్రియత యను శక్తిని మననుండి దూరపరచి యన్యులకు లేక మనకోరికలకు మనను బానిసలను చేయునది యీతరగతిలోనే చేరుచున్నది. కావున నిది తప్పుడలవాటై యున్నది. తేనీటిపానము మితిమీఱిన త్రాగుడుగ బరిణమించునని సూచించినంతనే కొందఱులికిపడుదురు. కాని జనులలో నస్వాభావిక దాహమును కలుగజేయునట్టి



వస్తువులన్నియు నాదాహమును శాంతింపజేయుట కంతకన్న నుత్తేజక పదార్థవిశేషముల నుపయోగించు టావశ్యకమగు నట్లు చేయును. తేయాకు స్వయముగ నుత్తేజకపదార్థమై యున్నది. అధికోత్తేజముకొఱకది త్రాగబడుచున్నది. కొందఱి యొక్క యభిప్రాయమిందు కెంతవిరుద్ధముగ నున్నను తేయాకు మత్తు కట్టిదే యైయున్నది. ఎక్కువపని చేయగలుగుటకును, ఎక్కువ యాలోచన చేయగలుగుటకును నాడీమండలమునకు చుఱుకు కలుగజేయు నిమిత్తము తేనీటిపానమును స్వల్పముగనే యైనను వాడుకలో పెట్టినవారు (అమితమను శబ్దము యొక్క ఖండితమగు నర్థము ననుసరించి) యిప్పటికే యమితత్వపథములో నడుగుపెట్టినవారగుచున్నారు. వారు తాము ప్రవేశించిన రాజబాటయందు ముందుకు సాగిపోయి స్థూలతరములును, మిక్కిలి వినాశకరములును నగు నవస్థలను దరియకుండ నుండెదరనుట కుత్తరవాదిత్వ మెద్దియు లేదు.

తేనీటిపానము మనను జంతుసంబంధములగు కోరికలకు నిలయమగు స్థితిలో పడియుండునట్లు చేయుననుట కేమాత్రము సందియము లేదు. ఎవరు దైహిక మానసిక బలముకొఱకును, నాడీమండలమున కుద్రేకము కలుగుటకొఱకును, నేదేనొకపదార్థముపై నాధారపడియుండెదరో వారు తమ యాధ్యాత్మిక స్వభావమును జంతుగుణశీలమునకు కొంతవఱకు బానిసనుగా నొనర్తురు. ఈఫలితమనివార్యమై యుండును.

ఈగ్రంథముయొక్క ప్రథమ ప్రకరణములోనే నుదహరించియున్నట్టి యీపానీయమువలన గలుగు వ్యర్థవ్యయము

కూడ యిది నైతికస్వభావమును చెడగొట్టుననుట కొకనిదర్శనమైయున్నది. వట్టి భోగపదార్థముగ మాత్ర ముపయోగపడునట్టియు, సాధారణముగ నే విషయమునను ముఖ్యమైనది కానట్టియు నొకవస్తువునిమిత్తము సంవత్సరమునకు పది, పండ్రెండు *మిలియనుల (ఒకమిలియను పదిలక్షలు) డాలర్లు వ్యయముచేయుట సామాన్యకార్యము కానేరదు. తేనీరు నైతికబుద్ధిని మందపఱచుటయేగాక మఱింతపాడుచేయును.

దేశీయులందఱు కలసిచేయు దానములకుగాను సంవత్సరమునకు మిలియనులో నాలగవవంతు మాత్రమె వ్యయపఱచుచున్నపుడు ముఖ్యముగా తన దానములగుఱించి అందును కొన్ని యుత్తమ దానముల గుఱించి గర్వించునట్టి సంఘము (వానికిది నైతిక బుద్ధిమాంద్యము) చెల్లును. పరదేశములలో మతవ్యాపనము చేయునిమిత్తము వ్యయమెంత యగుచున్నదో విచారింపుడు. క్రైస్తవసంఘము ప్రపంచప్రజలనెల్ల తనమతములో చేర్చుకొనుటకుగాను సాధ్యమైనన్ని యత్నములతో నుద్బోధింపబడియును 250000 డాలర్లు ధనమును ప్రతివత్సరము నీయలేకున్నను తేయాకుకొఱకుమాత్రమునంతకు నలువదిరెట్లకెక్కువ ధనమును వ్యయము చేయుచున్నది. ఇది వింతగదోచుటలేదా? తేనీటిత్రాగుడుయొక్క ప్రాబల్యము నీతివిరుద్ధమైనదికాదా ?

---

* సంవత్సరమునకు తేయాకుకొఱకు 18000,000 డాలర్లు వ్యయమగుచున్నవని కొందఱంచనా వేసినారు.



# సప్తమ ప్రకరణము

## తేనీటిపానము చేయువారి సాధారణ ప్రతివాదము

కొందఱిట్లు చెప్పెదరు "మీరు దీర్ఘకాలమునుండి గట్టిపట్టుతో తేయాకు మందుదినుసని నిరూపింప యత్నించుచున్నారుగదా! దీనిని వాడకూడదనుటకీవాద మెటుల యుపయోగపడును? ఔషధగుణములు కలదగుటచే సీమవంకాయను వైద్యులు మున్నగువారు పథ్యముగా విధించుటలేదా? అట్లే యుల్లిపాయలు విధింపబడుటలేదా? మఱియు సంబారములు—ఆవ, మిరియము, మసాలాపొడి, (Saleratus) సాలేరేటస్ అల్లము, లవంగ పట్ట (దాల్చిని) తుదకు ఉప్పు, కాడి యివన్నియు మందుదినుసులు కావా?"

పైన నుదహరింపబడిన వస్తువులు మందుదినుసులు కాని మందుగుణములతో కూడిన దినుసులు కాని యైయున్నవని నేనొప్పుకొందును. కావనను కాని పై యూహ న్యాయయుక్తముగ నున్నదనిమాత్రము నే నంగీకరింపను. భోజనపదార్థములతోపాటీ వస్తువుల నుపయోగించుచున్న మనుష్యజాతి యెంత యారోగ్యము కలదిగ నున్నను యీవస్తువులను వాడకుండ నుండునేని నిశ్చయముగా మఱింత యారోగ్యవంతముగ నుండగలదు. యథార్థమునకు మందు అన్యపదార్థమై ప్రాణశక్తులపాలిటి పరమశత్రువై యున్నది. మందు జీర్ణాశయముతో సహజ సంబంధముకల పదార్థముకాదు. జీర్ణకోశము స్వీకరించునట్టి యుక్తాహార పానీయములలో నొక్కటి

కిని సహజసంబంధములేదు. రసభస్మము, నల్లమందు, సారాయము అవ, మిరియము మున్నగు రూపములలో నేరూపముతోనున్నను కొంచెము గొప్పయను పరిమాణములలో నేపరిమాణము కలిగియున్నను నివి యౌషధలక్షణములతో కూడియుండుట నిక్కవము. సీమవంకాయలు, ఉల్లిపాయలు తేయాకులు వీనిలో స్వల్పపరిమాణముకల మందుకలదు. ఇది సత్యమే. ఔషధగుణములు కలవగుటచేత నీపదార్థములు ఆహారపానీయములుగా నుపయోగించుట కర్హమైనవి కానేరవు. అవి హానికరములే. ఔషధము ఆహారము నను నీరెండును గుణకర్మలు రెంటియందును పరస్పర విరుద్ధపదార్థములై యున్నవి.

మఱియు నన్నిట్లడిగెదరు "అన్నిరకముల తేయాకును కొద్దిగనో, గొప్పగనో విషయుతమే నని మీరు నుడివియున్నారు. దాని నుపయోగించుచున్నవాని కది యేమగును? కొలదిగనో, గొప్పగనో మనము తినునట్టియు, త్రాగునట్టియు, పదార్థయులన్నియు విషయుతములైనవే. అటులకానిచో నది బహుశా మన కేమియు మేలుచేయనే చేయవు?" ఈ ప్రతివాదము మొదటికంటెను బలహీనమైనది. ఏలనన కొందరజ్ఞానులు తలచునట్లుగా విషము మనపోషణమున కవసరమైనదనుమాట సత్యముకాదు. మనము తినునట్టి పదార్థములన్నియు విషముతో కూడియుండుననను నంశమంతకంటెను సత్యదూరము. పిండిగల ధాన్యములెవ్వియు సాధారణస్థితిగతులలో నొక యణుమాత్రము విషముకూడ కలిగియుండవు.



రైధాన్యములో నొకానొకప్పుడు (ergot) బూజువంటి తీవ్రవిషము కన్పట్టును. ఇది నిజమేకాని యిట్టు లెప్పుడే నొకప్పుడు మాత్రమే కన్పట్టును. ఇట్లే మఱికొన్ని విషములు మన ధాన్యములలో చేరుచున్నవి. కాని సహజముగా ఫలించి పరిశుద్ధముగానుండు ధాన్యములలో నెంతమాత్రమును విషముండదు. సీమరేగు, బెరీ, పుచ్చ, ఎండుద్రాక్ష, కిస్‌మిస్, స్ట్రాబెర్రి మున్నగు ఫలములలోగాని, బంగాళా, ముల్లంగి, బీట్ మున్నగు దుంపలలోగాని, బఠాణి, చిక్కుడు మున్నగు గింజలలోగాని విషములేదు.

అట్లైన ధాన్యాదులనుండి సారా విషమెట్లు లభించుచున్నదని ప్రశ్నింతురేమో? అందుకు సమాధానము చెప్పచున్నాను. ఆపదార్థములలో రసాయనిక వికల్పము నొదవించుటచే అనగా పులియబెట్టుటచే వానినుండి సారా విషముసంభవిల్లుచున్నది. పంచదారతో కూడియుండు పదార్థములలో దేనినైనను పులియబెట్టవచ్చును. పులిసినపొంగు సారాయిని కలుగజేయును. రసాయనిక క్రమముతో ఫ్రెంచిగచ్చును (Plaster of Paris) వేటు చేసినట్లయిన గంధకద్రావకము (Oil of Vitriol) పచ్చిసున్నము నను రెండు తీక్ష్ణరుచియు, చెడ్డవాసనయుగల విషములు లభించును. కాని గచ్చులో గంధకద్రావకము, పచ్చిసున్నము నున్నవని యెవ్వరనగలరు? పొట్టపట్టునేని గాలనులలో నాల్గవవంతు గచ్చు నొకమనుష్యుడు తినవచ్చును. అతనికి కొంచెమైనను విషమెక్కదు. అన్నివస్తు

వులలోను విషమున్నదను వాదమున కిదియె చాలినంత సమాధానము నిచ్చునుగాక.

స్వభావమును బట్టి విషయుతములు కాని, వస్తువుల నెన్నిటినో చంపునట్టి వానినిగా జేయవచ్చునని నే నెఱుగుదును. పరిశుద్ధమైన యొక యణుమాత్రము విషముకూడ తనలో నెన్నడులేనిదై యుండు జలము, అమిత వేడిమి, అమితాయాసము, బలహీనము కలిగియున్నపుడు మితిమీరిన చల్లదనము కలదై యుండగా త్రాగబడునేని చంపును. ఒక్కొకపుడు తత్క్షణమే చంపివేయును. సీమరేగు బండ్లను గాని రొట్టెను గాని యమితముగా తినినంత మాత్రముననే వెక్కసము గలుగవచ్చును. జీర్ణాశయము లోపలి భాగముపై దట్టముగ దద్దుర్లు పుట్టవచ్చును. కాని నిజమున కీరెండు విషయములలోను విష సంబంధములేదు. ఎంత స్వల్ప పరిమాణముతో నైనను సరియే ఆరోగ్యము యొక్క వివిధావస్థలలో నెపుడు సేవింపబడినను ప్రాణశక్తులను నశింప జేయు స్వభావము కలది విషమనబడును. సారాయి, నల్లమందు, రసభస్మము, ప్రిస్సిక్ యాసిడ్ (Prussicacid) పొగాకు, తేయాకు, కాఫీ, నిజము విచారింప మందు దినుసులన్నియు నిట్టి స్వభావము కలవైయున్నవి. తేయాకు నందు విషమేయున్నచో నది హానిచేయలేనంత కొద్దిగా నుండునని చెప్పెదరేమో. కాని సూక్ష్మముగా విభజింప బడుటచేత విషము విషస్వభావమును విడుచునను సంశయ మింకను ఋజువు పడవలసినదై యున్నది. యథార్థమునకు సజీవ శరీరముపై దాని ప్రయోగమును గూర్చి



విచారించి నంతవఱకు దీనికి విరుద్ధమగు పక్షమే (విభజింపబడినంతమాత్రమున విషము విషస్వభావమును విడువదు అను పక్షమే) సత్యమైనదను సందేహమును పుట్టించు నట్టి విషయములకు కొదువ లేకుండ నున్నవి. సారూప్యౌషధ సిద్ధాంతము వాడుకలోనికి రాకముందే రస భస్మము తేలుకొండివంటి విషౌషధి, నల్లమందు మున్నగు తీక్ష్ణమైన మందులు శరీరము యొక్క ప్రతిభాగము లోనికి కొద్దికొద్దిగా మాటిమాటికి ప్రవేశపెట్టబడినచో లోపల చేరిన యౌషధమంతటి యొక్క పరిమాణము ననుసరించి, పెద్దపెద్ద మోతాదులు వాడి నప్పటికంటె నెక్కువగ శరీరమును విషయుతము చేసి తమతమ ప్రత్యేక గుణములను కనుబఱచు నను సంగతి తెలియబడి యుండెను. తేయాకును సాధారణ ధర్మమగు నీనియమములో చేర్చకుండ వినాయింప సాధ్యమగునా? తేనీటి పానమును గూర్చి మఱియు నిట్లు చెప్పెదరు. "అది బలకరము, మాకేదే నొక యుత్తేజక పదార్థ మావశ్యకము. తేనీరు లేనిచో ముఖ్యముగా కష్టపు పనిచేయు నపుడు తేనీరు త్రాగనిచో నేను మూర్ఛిల్లి పడిపోవలసినదే". త్రాగుబోతులు, పొగాకు నములువారు, చుట్ట త్రాగువారు, పొడుము పీల్చువారు, నల్లమందు మ్రింగువారు, కూడ యిట్లే చెప్పెదరు. ఈయన్నిటికిని హేతువొక్కటియే. అందఱును ప్రేరేపక పదార్థము అనగా నాడుల కుద్దీపనము నొదవించు పదార్థము తమ కవసరమనుచున్నారు. అందఱును తమకు ప్రియమైన ప్రేరేపక పదార్థమే బలము నిచ్చునని వాదించుచున్నారు. ఏదే నొక యుత్తేజక

వస్తువు లేనిదే యెవరును జీవింప జాలరను మాట సత్యమైనదే. శ్వాసకోశముల కాహారమగు గాలి, యొక విధముగా నేత్రముల కాహారమనదగు వెలుగు, శరీరభాగములలో దేనిని గాని యారోగ్యవంతమగు కర్మచేయ కలుగునట్లు కదలించునట్టి యితర వస్తువులు ఇవన్నియు నుత్తేజక పదార్థములే. అయినను మనము సాధారణముగా దేహముయొక్క పైభాగమునగాని లోపలి భాగమునగాని నాడులయొక్క కొనలను రేపునట్టిలేక యుద్రేకింప జేయునట్టి వస్తువులనే యుత్తేజక పదార్థములని వాడుచుందుము. కాని యివి మనకు స్థిరమైనట్టి బలము నీయవు. అవి మనకు చేయు సహాయము మోసకృత్యమై యున్నది. అవి మనను కొంతకాలము బలశాలురుగను, చుఱుకుగ పనిచేయు వారుగను, ఉత్సాహపూర్ణులుగను నగునట్లు చేయును. కాని వాని శక్తి క్షీణింపగనే శీఘ్రకాలములోనే మొదట కలిగిన బలమునకు సమానమైన, కొంతవఱకు నెక్కువయే యైన బలహీనము కలుగ నారంభించును. కాన తేనీరు మనకు బలము నిచ్చినను దానిశక్తి క్షీణింపగనే మనము దాని నుపయోగింప మొదలిడి నప్పటి కంటె నెక్కువ హానికరమగు దశలో మనను వదలి వేయును.

అవిలేనిచో వానిని వాడువారు సొమ్మసిల్ల వలయుట కేవలము బలహీనతకు గుఱుతు కాని యుక్తాహార లోపమువలన నొదవునట్టి యావశ్యక చిహ్నము మాత్ర మెంత మాత్రమును కానేరదను సంగతి జాన్ కోల్ గా రుదహరించిన



మొదటివృత్తాంతము ద్వారా తెలుపబడినది. మఱియు స్వల్ప సారాయములు, నల్లమందు, ద్రాక్షాసవము, తుదకు సీమ రేగు బండ్ల సారాయి, తేనీరు, కాఫీ యివి మూర్ఛను అనగా నిస్త్రాణను తత్క్షణమే పోగొట్టుటయు, ఆహార మట్టిబలమును వెంటనే కలుగజేయుటకు కొంత సేపు పట్టుటయు సాధారణముగ జరుగుచున్నదే.

"అయిన తేనీటి యందు పోషించు శక్తిలేదనుటయే సత్యమా? విచారింప నొక్క యణువైనను పోషించునట్టిది తేనీటిలో లేదు. తేనీరని మనము పిలుచునట్టి ద్రవములో విస్తార భాగమైయుండునట్టి జలము మాత్రము (సాధారణస్థితిగతులలో కనీసపు పక్షమున) పోషక పదార్థమై యున్నది. జలము రక్తమును పలుచన చేయును. రక్తము మిక్కిలి యారోగ్యదశ యందుండు నట్లుచేసి సారూప్యత నొందుటకు యుక్తమగు నట్లు పనిచేయును. ఈయర్థములో నది పోషక పదార్థమగును. సాధారణముగా తేనీటితో పాటు పాలు,మీగడ, పంచదార స్వీకరింపబడును కావున దానిలో కొంత యాహారము కలదని నేనొప్పుకొందును. కాని యిక్కడకూడ తేనీటిలోని యాహారమునకంటె ఒక చిన్నరొట్టెముక్కలోను, ఒకపండులో నొక చిన్నభాగములోను నెక్కువ యాహారముండునని న్యాయముగ చెప్పవచ్చును. అతొన్న కంటె తక్కువ పరిమాణముగల గట్టి యాహారమును సం

గ్రహించుటకై 12, 20, 30 ఔన్సుల ద్రవమును మన మేల త్రాగవలయును ? మన యీ హేతువాదము నెల్ల నిరాకరించి కొందరింకను తేనీరు తమకు కీడు చేయదనియే చెప్పుచున్నారు. అనుభవము సురక్షిత మార్గదర్శియు, నుత్తమోపాధ్యాయుడును కాదాయని వారనెదరు. అనుభవము నావలపెట్టి హేతువాదము చేయుట నామతము కాదు. అనుభవమునకే యెక్కువ ప్రాముఖ్యత నిచ్చుటకు మనము సర్వదా యత్నింపవలెను. కాని సత్యమగు ననుభవమువలెనే వంచకమగు ననుభవ మొకటిగలదు. మనము సత్యానుభవమునే వెదకి పట్టవలయును. స్వీకరించినతోడనే జీర్ణాశయము నందుగాని మఱియొకచోటగాని నొప్పినికలతను కలుగజేయునట్టి వస్తువులజోలికి పోకుండుట చాల మంచిపని. సామాన్యదృష్టికి వెంటనే గోచరముకానట్టి హానిని తఱచుగా ననేకవస్తువులు కలుగజేయును. ఇతరుల యనుభవమును పరిశీలించుటద్వారా స్వానుభవమును దిద్దుకొనునట్లు మనము నిర్బంధింప బడుచున్నాము. మన మాలోచించుచున్న విషయమునందలి యీ భాగమును ముందు వివరింపబడబోవు వృత్తాంతము, జరిగిన సంగతులు మిక్కిలి యాశ్చర్యకరముగా విశదీకరించును. యలెక్సెన్ సెయింట్ మార్టిన్ గారికి యెడమ డొక్కలో నొకగాయమై యది మానినపిదప నొక యంగుళమును మించినరంధ్రము నిల్చిపోయినది. దాని స్వభావమును



జూడుడు. దానిపై నెప్పుడు కప్పబడు కట్టు విప్పి దానిగుండ చూచినచో నున్న దున్నట్లంతయు కొంతవఱకు జీర్ణకోశములో జరుగు వ్యాపారములును కనుఁబడుచుండెను. ఈస్థితి గతులలో డాక్టరు బ్యూమోంటుగారు జాఠరరసస్వభావమును, గుణములను గూర్చి కొన్ని పరిశోధనలు చేయుటకు నిర్ణయించి తత్పరిశోధనల మూలమున ననేక విచిత్రములను కనిపెట్టినారు.

ఈవిచిత్ర విశేషములలో నొకటి కొంచెముగనైన నింద్రియజ్ఞానమునకు గ్రాహ్యము కాకుండనే ఇంతవ్యాధి యున్నందుకు స్వల్పబాధయైన తెలియబడకుండనే, యారోగ్యమేవిధమునను భంగము కాకుండనే జీర్ణకోశము యొక్క లోపలి పొరనుండి చీమే కాక రక్తముకూడ కారునంత హెచ్చుగా దానిలో మంటలు పుట్టి యది పగిలిపోవునైయున్నది. ఈయవస్థ తఱచుగా సంభవించుచుండును. దీనికి సాధారణ కారణము తినుటలో త్రాగుటలో హద్దుమీఱిపోవుటయే యైనను సారాయిలు, ద్రాక్షాసవము, బీరు, మత్తుకలుగజేయు పానీయములు కొద్దిగనేయైన విడువకుండ కొంతకాల ముపయోగింపబడుటవలన కూడ నిది సంభవించును. డాక్టరు బ్యూమోంటుగా రిట్లు చెప్పిరి:—"ఆత్రముతోడను, అధికముగను తినుట, తిన్నగ నమలక గబగబ నమలి మ్రింగుట, దారములతో వ్రేలుచుండు గట్టిగట్టి మాంసపు ముక్కలను మ్రింగుట యివన్నియు వెంటవెంటనే కొంతకాలము మాటిమాటికి నాచరింపబడునేని పై యవస్థలనే కలుగ జేయును. జీర్ణాశయముయొక్క పొరతోకూడిన కండరములయల్లిక

లలోను, పేగులలోపలను తరుణమేకాని కాలికమేకాని విస్తారమైన వ్యాధి మనము నమ్మదగినంత కంటె నెక్కువ తఱచుగా కలుగవచ్చును. పై పరిశోధనలు చేయబడిన వ్యక్తికి చాలహెచ్చుగనే మంచి యారోగ్య దశయందు సైతము మంటలు తప్పకుండ నుండెడివి.

డాక్టరు బ్యూమోంటుగారి పరిశోధనములు వేరు విధమగు ఫలితములను కనుబఱచు చుండగా సెయింటు మార్టిన్ గారియొక్క కేవలము ఇంద్రియ జ్ఞానముపై నాధారపడి యుండునట్టి "తిన్నగ నమలకుండ కడు వేగముగ మ్రింగబడిన యాహారముగాని, బీరు, సీమరేగు సారాయి, ద్రాక్షసారాయి తేనీరు, కాఫీ యివి హానిచేయలేదు" అను ననుభవమును మనము నమ్మవలయునా? నిజమే. ఆయన తన స్వానుభవమును బట్టియే చెప్పెను, కాని ఆయన యనుభవము విశ్వాసపాత్రమా? లేక డాక్టరు బ్యూమోంటుగారి పరిశోధనల ననుసరించి యాయనుభవమును సరిచేయవలయునా? కొంచెము పొగాకు నెమరు వేసిననేగాని మధ్యాహ్నభోజనము జీర్ణము కాదని తమ స్వానుభవమును బట్టి చెప్పువారి ననేకులను నేను చూచి యున్నాను. ఒకటిద్దఱు పొగాకు రసమును మ్రింగువఱకు నాహారము జీర్ణముకాదనువారు కూడ కలరు. ఈస్వానుభవము సత్యమైనదని తలపవలయునా? సరిచేయబడవలసినదియు నిజముకానిదియు నని తలపవలయునా? కనీసము తమ విషయమున నల్లమందువాడుక బ్రాందివాడుక చాలయవసరమని తమయనుభవము నిరూపించుచున్నదని నమ్మువారింకను



నెందఱో యున్నారు. "ఆవస్తువులను వాడినచో మే మెక్కువ పని చేయగలము. ఆపని నెక్కువ చక్కగ చేయగలము. అవి మాకు శ్రేష్ఠమైన వెందుకు కావు." అని వారనెదరు. కాని ఎక్కువ పనిని, యెక్కువ చక్కగ నెంతకాలము వారు చేయగలరు? ఆయుత్తేజకపదార్థపరిమాణమును హెచ్చించకుండ, హెచ్చించకపోవుటచే క్షీణింపకుండ నెంతకాలముండగలరు? బాధ యను పంట కోయుటకై యీలోపుగా వారెన్నెన్ని యితరరోగరూపక బీజములను చల్లుకొనుచున్నారు?

"పొట్ట యెద్దానికైన వసతి నిచ్చును. అభ్యాసము మిగుల బలీయమైనది" అనుట వాడుకగ నున్నది. అభ్యాసబలమును, పొట్టయొక్క వసతినిచ్చుశక్తిని నే నంగీకరింతును. పోంటస్ రాజ్యపరిపాలకుండగు మిత్రిడేట్సు అను రాజు ప్రాణహానికరమగు విషౌషధిని తినుట కలవాటు పడియుండె నని కూడ నే నొప్పుకొందును. అయిన నేమయ్యె? మిత్రిడేట్సు విషౌషధివలన హానిపొందకుండ నుండెనా? ఆవిషౌషధి జీర్ణాశయముయొక్కయు, నాహారనాళముయొక్కయు లోపలిసన్నపొరయందు మంటలు పుట్టింపలేదా? అది వ్యాధికి కారణముగాని వృద్ధికరముగాని కాకుండ నుండెనా? ఆరాజు డెబ్బదియేండ్లు జీవించెనని చెప్పెదరేని యంతకంటె నెక్కువకాలము జీవించిన త్రాగుబోతులను నే నెఱిగియున్నానని నే నుత్తర మిత్తును. నల్లమందు విడువక తినువారిలో కూడ నిట్టివారు కలరు. మిత్రిడేట్సు హెమ్లాక్ విషౌషధి నభ్యసించుట కారంభించిన వయస్సుకంటె చాలతక్కువవయస్సున నే

యమిత త్రాగుబోతుతనమున కలవడిన పురుషులు దీర్ఘకాలము జీవించినారు. అమిత పానము వలని దుష్ఫలితముల నుండి ఎటులో తప్పించుకొనిన వారలలో నొక్కొకనికి వేయిమంది పడిపోవుచున్నపుడు అదృష్టవశాత్తు తప్పించుకొనుట, బెల్లపు సారాయి నల్లమందు మున్నగునవి నిరపాయకరములనియు నేకొంచెమేని యుపయోగకరములనియు నిరూపింపగలదా? సంపూర్ణముగా మనస్వానుభవ సిద్ధాంతమునే మార్గదర్శకముగా గైకొనినచో నిట్టి పర్యవసానమే తేలును. పొట్ట యన్నిటికి వసతి నిచ్చునని నిర్ధారణచేయునిమిత్తము మిత్రుడేట్సు నుదాహరించువారందఱు నిజముగా నీపర్యవసానమునకే వత్తురు. ఈవసతి నిచ్చుటవలన నేదుష్ఫలితమును కలుగదనియే తేలును.

(పైవిషయములకు సమాధానములు)

(1) అన్ని వస్తువులకును వసతి నిచ్చుదశలో పొట్ట నిస్సందేహముగా రోగమయమై యుండును. ఇటువంటి స్థితి యసంతోషకరమును, అవాంఛనీయమును నగుటయేగాక సాధారణ నియమానుసారముగా నితరవ్యాధుల కున్ముఖమై యన్నివ్యాధులయొక్క సహజ బాధాస్వభావమును మిక్కిలి కఠినపఱచి మిక్కిలి హానికరములగునట్లు చేయునట్టిదై యున్నది.

(2) పైవస్తువులను సేవించువారిలో నెవ్వరో యొకరు దృఢగాత్రులై యుండుట వలన నెక్కువ కాలము వృద్ధులై జీవించినను వారా వస్తువులను ముట్టకుండ నుండినచో నెంత



కాలము జీవింపగలరో యెంతకాలము మాత్రము జీవింపనేరరు.

(3) అట్టివస్తువులను సేవించువారికొకవేళ సంతానముకలిగిన నాసంతానము తప్పకుండ వ్యాధిదాయము ననుభవించి తీరును. అట్లుకానిచో వారి యుదాహరణము వారి పుత్రపౌత్రాదులపైనను, వారి పుత్రపౌత్రాదుల యుదాహరణము వారి పుత్రపౌత్రాదులపైనను ప్రబలముగా పని చేయును. ఇటుల నీ యుద్ధములోపల తీసివేత యనునది లేనేలేదు. పొట్టయొక్కగాని యేదే నవయవము యొక్కగాని వసతులన్నియు శరీరముయొక్క భవిష్యద్వ్యయముతో కూడినవై యున్నవి. సంతానమునుండి వడ్డీతో సహా రాబట్టుకొనునవై యున్నవి. "దేహతత్త్వమునందు భేదము లేదా? ఒకని కాహారమగు వస్తువు మఱియొకనికి విషముకాదా? అని ప్రశింతురు. సామాన్యముగా నర్థముచేసినట్లు కానేరదు. శరీరతత్త్వమునందు గుఱ్ఱములలో పశువులలో నెట్టిభేదము కలదో అట్టి భేదమే మానవులలోను కలదు. అంతకంటె హెచ్చు భేదము లేదు. మనుష్యశరీరతత్త్వము చెడిపోవక పూర్వము గుఱ్ఱపుశరీరతత్త్వమువలె నొక్కతీరుగ నుండెను. ద్వితీయ స్వభావ మగు నలవాటు ప్రథమస్వభావము కంటె బలవత్తరమగు నంత హెచ్చుగా మారిపోయిననే తప్ప సాధారణనియతి ననుసరించి యొకవ్యక్తికి మంచివగు నాహారపానీయములు మఱియొక వ్యక్తికిని మంచివే యగును. ఆవులు చేపలను, పిల్లులు రొట్టెలను, కుక్కలు పొగాకును తినుటకలవాటుపడు

నల్లే మనుష్యులు పొగాకు, బెల్లపుసారాయి, తేనీరు, హెమలాక్ వీనిని భరింపగలుగుచున్నారు. అనేకు లీవస్తువుల నమితముగా ప్రేమించుచున్నారు.

“తేనీరు లేకపోయిన నాకెంతో నష్టము కలిగినట్లుండును. అది లేకుండ ఉదయభోజనము చేసితినని నే ననుకొన లేను” అని కొందఱు మొఱలిడుదురు. తేనీరు లేకుండ భోజనము సిద్ధముచేయుటకు గృహస్థు లెందఱేనిల్లే యింతకంటె నధికముగ గూడ సంకట పడుచున్నారు. అయినప్పటికి యుక్తసమయమున కీ సంకట మెల్ల నివారణము కాగలదు. అది కేవలము అభ్యాసబలమును మాత్రము ప్రదర్శింపగలదు.

“మంచిది, సంతోష యుతమగు నల్పకాల జీవితమునే తుదకు నే గోరుకొందును. అంత్యకాలపు 5 లేక 10 దౌర్భాగ్యసంవత్సరముల కొఱకు నాజీవిత సౌఖ్యములలో నొక దానిని నేను త్యజింపవలె నని తలంపను” అని జను లనుట నేను విని యున్నాను. కాని యిందులో కొంతపొరపాటు కలదు. జీవితకాలమునకు పది యేండ్లను చేర్చుటలో నంతయు నంత్యకాలమున కే చేర్పబడుట లేదు. తక్కిన దానితోపాటు మధ్యకాలముకూడ దీర్ఘపఱుప బడుచున్నది. ఇక సంతోషయుత జీవితమందు ఈప్రకటనము నమ్మబడక పోయినను దీర్ఘాయురారోగ్యవంత మగుజీవితము దాని వైరాగ్యములను లక్ష్యపెట్టకుండ నత్యంతసంతోష కరమై యుండును.

తుదకు కొద్దిమంది ఈరీతిగా నుడివెదరు. “అది మాకపకారము చేయు నని తెలిసినను మేము తేనీటిని విడువకుండ



పానముచేసెదము”. వారద్దానిని ప్రేమించుచున్నారు గావున దేహమనస్సుల కెట్టి విపత్తు సంభవించినను దానిని గ్రోలుచునే యుందురు. “అది యెవ్వరి పనియుగాదు. అది మా స్వంత కార్యమే”యని యనుచుందురు. కాని యిది యింతేనా? సంఘములో నీ వొకడవు కావా? ఒకించుక యుపయుక్తతయైన లేని యనర్హునిగా నిన్ను చేయు నట్టి ప్రవర్తనము నవలంబించినపుడు సంఘమును గుఱించిన నీవిధాయకమును నీవతిక్రమించిన వాడ వగుట లేదా? నీయుదాహరణమునకు ప్రాబల్యముండదా? అందువలనఁ గలుగు చెడుగు స్వల్పమైన దని నీవు రూఢిచేసినను చెడ్డదగు దృష్టాంతమును నెలకొల్పుటకు నీ కధికారము కలదా? అట్లుచేయుదువా? అట్లు చేసి యుత్తమ పౌరుడ నని యనుకొన గలవా? ఇతరులచేత నట్లు భావింప బడగలవా?

నీకు సంబంధ ధర్మములు లేవా? ఎన్నఁడును నీ వట్లుచేయ గూడనివగు, వ్యర్థవ్యయమై పోయిన ప్రాణశక్తులమాటయటుండ వ్యర్థవ్యయమై పోయిన నీయార్జనములు తమకుకావలసి యుండు వారగు తల్లి, తండ్రి, అన్న, చెల్లెలు, కొడుకు లేక కూతురు నీకు లేరా? నిర్మలాంతఃకరణము కలవాడవై నీవు ధనమునుగాని సమయమును గాని వ్యర్థవ్యయము చేయగలవా? సమయముకూడ ధనమే- అది నీబిడ్డలను విద్యావంతులను జేయుటకు కాకున్నచో మఱియొక విధముగా వారికిని నీయితర స్నేహితులకు కొందఱికిని కావలసి యుండ వచ్చును. ఇంతియేగాక ప్రపంచములో నీవు చేయవలసిన ధర్మకార్యములు

లేనా? తేనీరు త్రాగు వ్యక్తికి క్రైస్తవ మతధర్మములను, క్రైస్తవనీతిసూత్రములను గూర్చి పలుమారు బోధించుట వలన ప్రయోజనము లేక పోవచ్చును. ఏలనన కొన్ని సమయములలో తన శాస్త్రములతో సంబంధము లేదని యతడన వచ్చును. అయినను సర్వసాధారణముగా తేనీరు త్రాగువారు క్రైస్తవమతమునందు తమకు నమ్మకము కలదని బహిరంగముగానొప్పుకొనుచున్నారు. పౌలు (Paul) యొక్కయు, నతనిసమకాలీనులును, సహాయులును నగు వారియొక్కయు ప్రామాణికత్వమును వారంగీకరించుచున్నారు. పైప్రామాణికులు మన కేమి చెప్పుచున్నారు "ఏమనుష్యుడును తనకొఱకే తాను జీవించుట లేదు. తనకొఱకే తాను మరణించుట లేదు" అనియు దేవుని యొక్క సమానస్వత్వములగు దేహములోను ఆత్మలోను గూడ మనము దేవుని ఘనపఱచి యాయన మహిమను బ్రకటింపవలయు ననియు చెప్పుచున్నారు.



# ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 16 | రక్తప్రక్షాళన చికిత్స (పటముతో) | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 17 | పచ్చితిండివలని ప్రయోజనము | 0 | 12 | 0 | 0 | 10 | 0 |
| 18 | స్వాభావిక చికిత్సానియమములు | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 19 | తొట్టిస్నాన నియమములు | 0 | 6 | 0 | 0 | 5 | 0 |
| 20 | నిర్వ్యాచారభావిజీవనము(కొబ్బరిగూర్చి) | 1 | 8 | 0 | 1 | 0 | 0 |
| 21 | యోగచికిత్స (హిందికి తెనుగు) | 0 | 6 | 0 | 0 | 5 | 0 |
| 22 | ప్రాకృత చికిత్సార్ణవము 1వ॥ భా॥ | 1 | 8 | 0 | 1 | 0 | 0 |
| 23 | ప్రౌఢప్రభాకరము (1,2 భాగములు) | 2 | 0 | 0 | 1 | 8 | 0 |
| 24 | శుక్లనష్టము (1వ భాగము) | 0 | 12 | 0 | 0 | 9 | 0 |
| 25 | లక్ష్మణజలచికిత్స (పటములతో) | 0 | 12 | 0 | 0 | 8 | 0 |
| 26 | మహారోగము (హఠయోగీంద్రులు) | 0 | 8 | 0 | 0 | 6 | 0 |
| 27 | ఔషధవైద్య మొక యూహాశాస్త్రము | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| 28 | శిశుమాతల శోక సందేశము | 0 | 4 | 0 | 0 | 3 | 0 |
| 29 | ప్రకృతిచికిత్స (పం॥ అయ్యాగ్ గారు) | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 30 | ప్రకృతిచికిత్స (కె. యల్. శర్మగారు) | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| 31 | స్త్రీలవ్రతము (జ్ఞానాంబగారు) | 0 | 3 | 0 | 0 | 2 | 0 |
| 32 | ప్రకృతిచికిత్స కా॥ నాగేశ్వరరావుగారు | 0 | 5 | 0 | 0 | 4 | 0 |
| | తత్వలక్ష్యార్ణవము (వైరాగ్యము) | 1 | 0 | 0 | 0 | 15 | 0 |
| 33 | తెల్లచక్కెరవలని విపత్తు | 0 | 10 | 0 | 0 | 6 | 0 |
| 34 | తేనీరు విషతుల్యము | 0 | 10 | 0 | 0 | 6 | 0 |
| 35 | ప్రాకృత చికిత్సార్ణవము (2. భాగము) | 1 | 4 | 0 | 1 | 0 | 0 |
| 36 | ఆరోగ్యము - కామేచ్ఛ | 0 | 3 | 0 | 0 | 2 | 0 |

అడ్రెసు—మేనేజరు, ప్రకృతి, బెజవాడ.

# ప్రకృతి చందాదారులకు తగ్గింపు ధరలు.

| | | |
|---|---|---|
| 37 జీవహింస (1 భాగము) | 0 10 0 | 0 6 0 |
| 38 పొగచుట్ట-ముక్కుపొడుము 1 భాగము | 0 10 0 | 0 6 0 |
| 39 కల్లుముంత-సారాయి సీసా. 1 భాగము | 0 10 0 | 0 6 0 |
| 40 వర్ణచికిత్స | 0 6 0 | 0 5 0 |

☞ పుస్తకముల జాబితా ఉచితము.

# ప్రకృతి సంపుటములు.

ప్రకృతి 1, 3, 4, 5, 6, 7 సంపుటములను, విడి సంచికలును తగ్గింపు ధరలకు దొరకును. ఇందు సుప్రసిద్ధ ప్రకృతి చికిత్సకులచే వ్రాయబడిన అమూల్య వ్యాసములు, ప్రశ్నోత్తరములు, మున్నగున వెన్నియో కలవు. ప్రతివైద్యునకును, రోగికిని మిక్కిలి యుపయుక్తమైనవి. వీనిని జదివినచో ప్రకృతిచికిత్సయందు దమితనైపుణ్యము గలుగును. కొలది ప్రతులుమాత్రమే కలవు. మరల ముద్రింపబడవు.

| | ఇతరులకు | చందాదారులకు |
|---|---|---|
| ప్రకృతి 1వ సంపుటము 3 నెల సంచికలు | 0 6 0 | 0 4 0 |
| ప్రకృతి 3వ సంపుటము 9 నెలసంచికలు | 1 2 0 | 0 14 0 |
| ప్రకృతి 4వ సంపుటము 12 నెలసంచికలు | 1 8 0 | 1 2 0 |
| ప్రకృతి 5వ సంపుటము 12 నెలసంచికలు | 1 8 0 | 1 2 0 |
| ప్రకృతి 6వ సంపుటము 12 నెలసంచికలు | 1 8 0 | 1 2 0 |
| ప్రకృతి 7వ సంపుటము 10 నెలసంచికలు | 1 2 0 | 0 15 0 |
| 36 English Supplements to Prakriti | 0-0-6 | 0-0-3 |
| 4 do (Booklets) each supplement | 0-2-0 | 0-1-0 |

అడ్రెసు:— మేనేజరు, ప్రకృతి, బెజవాడ.

